# మార్క్సిజం మూలసూత్రాలు

1

## గతితార్కిక భౌతికవాదం

కంభంపాటి సత్యనారాయణ
(సీనియర్)



# మార్క్సిజం

# మూలసూత్రాలు ①

## గతితార్కిక భౌతికవాదం

కంభంపాటి సత్యనారాయణ
(సీనియర్)




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

Marxism Muulasutralu - 1 (Gati Tarikika Bhotikavaadham)
By Kambhampati Satyanarayana (Senior)

---

రాజకీయ / సామాజిక / ఆర్థికశాస్త్ర గ్రంథాలు

ప్రచురణ నెం. : 26

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : డిశంబర్, 1953
మార్పులు, చేర్పులతో
ద్వితీయ ముద్రణ : మే, 1955
తృతీయ ముద్రణ : ఫిబ్రవరి, 2005

వెల: రూ. 12-00

ప్రతులు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-1.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం,
కాకినాడ.



---

ముద్రణ : **సరస్వతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**, హైద్రాబాద్ - 44.

# పరిచయం

ఆధునిక శాస్త్రపరిశోధనల ఆధారంతో మార్క్సు, ఎంగెల్స్‌లు కనిపెట్టిన గతితార్కిక భౌతికవాద సూత్రాలను సామాన్యపాఠకుల కర్థమయ్యేవిధంగా ప్రవేశం కలిగించడమే యీ పుస్తకంయొక్క ఉద్దేశం. అంతకుపూర్వం పీడిత ప్రజానీకానికి తమదని చెప్పుకోదగ్గ తత్వశాస్త్రమంటూలేదు. మార్క్సు, ఎంగెల్స్‌ల కృషి ఫలితంగానే ప్రపంచంలో మొట్టమొదటిసారి తత్వశాస్త్రం మానవాభ్యున్నతికి తోడ్పడగల సాధనంగా ఉపయోగపడగలదని రుజువయింది. దాని మూలసూత్రా లేమిటో, భావవాదానికీ, భౌతికవాదానికీ గల తారతమ్యమేమిటో, భౌతికవాదం గతితార్కిక భౌతికవాదంగా యెలా రూపొందిందో వివరించడానికి యీ పుస్తకంలో ప్రయత్నించాను.

అయితే, సిద్ధాంత ప్రధానమైన యీ విషయాన్ని సామాన్య పాఠకుల కర్థమయేవిధంగా వివరించడంలో స్థూలసామ్యాలు మాత్రమే యివ్వబడ్డాయి. ఉదాహరణకు పాశ్చాత్య భావవాదులూ, మనదేశంలోని భావవాదులూ ప్రతిపాదించిన సిద్ధాంతాలు నూటికి నూరుపాళ్లూ ఒకేవిధమైనవి కావు; స్థూలంగా మాత్రమే వాటి పోలికలను చెప్పడం జరిగింది. అలాగే, గ్రీస్‌దేశపు ప్రాచీన భౌతికవాదులూ, మనదేశంలోని చార్వాకులూ ప్రధానసూత్రాలలో మాత్రమే ఏకీభవిస్తారు.

రెండవది: ఇంగ్లీషులోవున్న కొన్ని సిద్ధాంత శబ్దాలను తెలుగులోకి అనువదించడంలో వాటి పూర్తి అర్థం వచ్చియుండకపోవచ్చు.

మూడవది: ఆర్యులకాలంలో ప్రకృతిశక్తుల ఆరాధనే ఆనాటి తత్వశాస్త్ర స్వరూపమని మొదటి అధ్యాయంలో పేర్కొనడం జరిగింది. వేరొకచోట, 'ఆత్మ' అనే భావం మానవుని అజ్ఞానంనుంచి పుట్టిందని చెప్పడానికి ఆటవిక ప్రజల స్వప్న జగత్తును పేర్కొనడం జరిగింది. అయితే దీని అర్థం ఆటవిక ప్రజలు భావవాదులని కాదు. భావవాదపు బీజాలు ఎలా మొలకెత్తాయో తెలియజేయడమే నా ఉద్దేశం.

ఈ పుస్తకాన్ని రచించడంలో హోవర్డ్ సెల్సామ్ రాసిన *"What is Philosophy,"* హెచ్. లెవీ రాసిన *"Social Thinking,"* జార్జి పొలిట్జర్ రాసిన *"An Elementary course of Philosophy"* అనే గ్రంథాలను ఆధారంగా తీసుకున్నాను.

**-రచయిత**

# విషయ సూచిక

# మొదటి అధ్యాయం

## తత్వశాస్త్రం యొక్క సాంఘిక పునాదులు

తత్వశాస్త్రం పరలోకానికి సంబంధించిన విషయాలను మాత్రమే విచారిస్తుందనీ, ఇహలోక సమస్యలంటే అది పట్టించుకోదనీ చాలామంది అభిప్రాయం. ఇది పొరబాటు. తత్వశాస్త్ర విచారణ పైకెంత నిగూఢంగా కనబడినా, తత్వశాస్త్రజ్ఞులు మొదటినుంచీ తమ చుట్టూవున్న ప్రకృతినిగురించీ, మానవ సమాజాన్ని గురించీ మాత్రమే ప్రధానంగా ఆలోచించారు. నేడు పరస్పర విరుద్ధమైన సాంఘికశక్తులమధ్య, ఉద్యమాలమధ్య సంఘర్షణలు అంతకంతకు తీవ్రరూపం ధరిస్తున్నాయి. ఈ సంఘర్షణల్లో పరస్పర విరుద్ధమైన సిద్ధాంతాలు బయల్దేరుతున్నాయి. మానవుని గమ్యస్థానాన్ని గురించి బయల్దేరే విభిన్న సిద్ధాంతాల నాధారంగా చేసుకుని వ్యక్తులు, సమూహాలు విభిన్నమార్గాలవలంబిస్తున్నారు. ప్రతివానికి ఒక్కొక్క తాత్విక విశ్వాసం వుండి తీరుతుంది. అది మనకు తెలియకపోవచ్చు. మన మొక భాష మాట్లాడుతున్నామనేది ఎంత నిర్వివాదాంశమో, మనందరికీ వేర్వేరు తాత్విక విశ్వాసాలున్నాయనేది కూడా అంత నిర్వివాదాంశమే.

ప్రతిమానవుడు ఉదరపోషణకై తన చుట్టూవున్న పరిసరాలతో నిరంతరం పోరాడవలసియుంది. వ్యవసాయ వృత్తిలో వున్నా, వ్యాపారం చేసుకుంటున్నా, గుమాస్తాగా వున్నా, కార్మికుడుగా పనిచేస్తున్నా- ఏదో ఒకపని మాత్రం ప్రతిమానవుడు చేసితీరాలి. ఇలా పనిచేసేటప్పుడు యితరులతో అతడు సంబంధాలు పెట్టుకోడం తప్పనిసరి అవుతుంది. అప్పుడతడు తననుగురించీ, తనచుట్టూవున్న ప్రపంచాన్ని గురించీ ఆలోచించడం, కొన్ని అభిప్రాయా లేర్పరచుకోవడం సంభవిస్తుంది. ఆ అభిప్రాయాలే తత్వశాస్త్రమనేసౌధానికి యిటుకరాళ్ళు.

అందుచేత మన మెవ్వరం తత్వశాస్త్రానికి దూరంగా ఉండజాలం. దాన్నిగూర్చి తెలుసుకోవడం మనకే ఉపయోగకరం.

తత్వశాస్త్రంజోలికి పోవద్దని సలహా యిచ్చేవారిని రెండు విధాలుగా విభజించవచ్చు. ఈ రెండు తరగతులవారు రెండు విభిన్న కారణాలు చూపెడతారు. మొదటి తరగతికి చెందినవారు, తత్వశాస్త్రం చదివితే పరలోక సమస్యలలో నిమగ్నులమై యిహలోక సమస్యలను పట్టించుకోమని చెబుతారు. తత్వశాస్త్రం మన జీవితాలకోస మేర్పడిందేగాని, మన జీవితాలు తత్వశాస్త్రంకోస మేర్పడలేదు. మనం యీ యథార్థాన్ని గుర్తించకపోతే, పై ప్రమాదం ఉన్నమాట నిజమే. ఉదాహరణకు, తత్వశాస్త్రంలో డిగ్రీ తీసుకున్న ఒక అమెరికన్ యువకుడు ఒకనాడు హోవర్డ్ సెల్సామ్‌ను కలుసుకున్నాడట. అతడు ప్రపంచమంతా మిథ్య అనీ, ఆత్మ ఒక్కటే యథార్థమనీ నమ్మిన భావవాది. ప్రపంచంలో యుద్ధాలు, కరువులు, నిరుద్యోగం మొదలైన బాధలు లేకుండా చేయడాని కత డొక విచిత్రమైన మార్గం సూచించాడు. అదేమిటంటే: ఆత్మహత్య చేసుకోవడం! కాని అదృష్టవశాత్తు అతడు తన సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టలేదు.

ఇక రెండవ తరగతికి చెందినవారు, తత్వశాస్త్రం చదివితే ప్రతిసమస్యను లోతుగా పరిశీలించవలసివస్తుందని, చిరకాలంనుంచి వ్యాప్తమవుతూన్న మూఢనమ్మకాలకు స్వస్తి చెప్పవలసి వస్తుందని, ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాలలో అభివృద్ధి నిరోధకశక్తుల్ని ఎదుర్కోవలసివస్తుందని భయపడేవారు. అందుకనే అమెరికాలో 1880 వరకు తత్వశాస్త్రాన్ని గురించి అధ్యాపకు లెవరూ పాఠాలు చెప్పకూడదని నిషేధం వుండేది. కొన్ని అమెరికన్ రాష్ట్రాలలో నేటికీ డార్విన్‌యొక్క పరిణామసిద్ధాంతాన్ని బోధించ కూడదనే ఆంక్ష అమల్లోవుంది. అనేక దేశాల విశ్వవిద్యాలయాల్లో భౌతికవాదాన్ని గురించి, గతి తార్కిక భౌతిక వాదాన్ని గురించి వక్రభాష్యాలతో కూడిన పాఠ్యగ్రంథాలు ప్రమాణ గ్రంథాలుగా పరిగణింపబడుతున్నాయి.

అందుచేత, మానవసమాజంలో ఏ వర్గానికి పెత్తనం ఉంటుందో, ఆ వర్గానికి చెందినవారు - ముఖ్యంగా అభివృద్ధినిరోధకులైన పాలకవర్గాలు - తమ ప్రయోజనాలను వ్యతిరేకమైన తత్వశాస్త్రాన్ని అణచివేయడానికిగాని, అదుపాజ్ఞలలో పెట్టడానికిగాని ప్రయత్నిస్తారు.

మానవ సమాజాన్ని చారిత్రకదృష్టితో పరిశీలిస్తే, వివిధ దశల్లో సాంఘికశక్తులమధ్య జరిగే సంఘర్షణలు విభిన్న తత్వశాస్త్రాల సంఘర్షణగా రూపొందినట్లు స్పష్టమవుతుంది.

ఉదాహరణకు ఋగ్వేదకాలంలో ఆర్యులు ఒకరి కష్టాన్ని మరొకరు దోచుకోకుండా, ఎవరి శక్తినిబట్టి వారు పనిచేస్తూ వారి వారి అవసరాలనుబట్టి కష్టఫలితాన్ని అనుభవించేవారు. అదే ఆదిమ కమ్యూనిజం. ఆ రోజుల్లో మానివునికీ, ప్రకృతికీ మధ్య జరిగే భయంకరపోరాటంలో ప్రకృతి శక్తుల మర్మమేమీ తెలియని ప్రజలు వర్షాన్ని వరుణదేవునిగాను, అగ్నిని అగ్నిదేవునిగాను, గాలిని వాయుదేవునిగాను భావనచేసి గానం చేసేవారు. ప్రకృతి ఆరాధనే ఆనాటి తత్వశాస్త్ర స్వరూపం.

తర్వాత పరిస్థితులు క్రమంగా మారాయి. పశువుల పెంపకం, వ్యవసాయంతోబాటు చేతివృత్తులమీద ఆధారపడేవారి సంఖ్య పెరగనారంభించింది. వారిని పోషించడానికి పంటలు అధికంగా పండించవలసివచ్చింది. ఆర్యులు అనార్యుల్ని బానిసలుగా చేసుకుని, వారి కష్టాన్ని దోచుకోవడం ద్వారా లభించే అదనపు పంటతో మొత్తం సమాజమంతా పోషింపబడేది. ఈ నూతన పరిస్థితుల కనుగుణ్యంగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రకులాలు వెలిశాయి. బ్రాహ్మణ, క్షత్రియులు పాలకులు; వైశ్యులు, శూద్రులు పీడితులు. అంటే సమాజం వేర్వేరు వర్గాలుగా విభజింపబడింది. ఈ దోపిడీ సమాజాన్ని సురక్షితంగా కాపాడుకొనేందుకు నూతన తత్వశాస్త్ర మొకటి అవసరమయింది. ఉపనిషత్తులరూపంలో అది ప్రత్యక్షమయింది. ఋగ్వేదకాలంనాటి ప్రకృతి ఆరాధనకు బదులు కర్మ సిద్ధాంతం తలయెత్తింది.

కర్మ సిద్ధాంతం ప్రాతిపదికగా గల భావవాదంమీద తిరుగుబాటుగా భౌతికవాదం తలయెత్తింది. చార్వాకసిద్ధాంతం పదార్థాని కతీతమైనశక్తి ఏదీ లేదనీ, ఆత్మ మానవకల్పితమనీ చెప్పింది. మానవుడు పృథివి, ఆపస్, తేజస్, వాయువు అను నాలుగు భూతాల కలయికవల్ల జన్మిస్తున్నాడు; అతని ఆలోచనలన్నీ శరీరాన్నే ఆశ్రయించుకొని ఉంటాయి; శరీరంతోబాటు ఆలోచనలు కూడా నశిస్తాయి; అందుచేత యజ్ఞయాగాలు చేయడం మూర్ఖత్వం; కర్మ సిద్ధాంతం బూటకం; బతికివుండగానే మానవుడు సుఖం అనుభవించాలి- ఇదీ క్లుప్తంగా

చార్వాక సిద్ధాంతం. సుమారు క్రీ.పూ. 600 నాడు ఈ సిద్ధాంతం ప్రచారం చేయబడింది.

వర్ణవ్యవస్థపై ఆధారపడ్డ బానిససమాజం అంతర్యుద్ధాలవల్ల శిథిలమై, దారి తెన్ను తోచని విషమపరిస్థితుల్లో బుద్ధుడు నూతన వ్యవస్థను నిర్మించడానికి సరికొత్త సిద్ధాంతాలు ప్రచారం చేయనారంభించాడు. కులాలు, కులభేదాలు నశించాలన్నాడు. మానవులంతా సమానులన్నాడు. అహింసయే పరమధర్మమన్నాడు. అంతర్యుద్ధాలతో విరక్తిచెందిన రాజులు, వర్తకవ్యాపారం అభివృద్ధి చెందాలనుకొన్న వర్గం, బానిస యజమానులకింద అమానుష జీవితాలు గడిపి పారిపోయి వచ్చిన బానిసలు బౌద్ధమతాన్ని ఆశ్రయించారు. బౌద్ధమతం బ్రాహ్మణమతంమీద ఒక తిరుగుబాటు. అంతర్యుద్ధాలవల్ల శిథిలమైపోతున్న పాత సామాజికవ్యవస్థకు అదొక సవాలు. బుద్ధుడు క్రీ.పూ. 550 ప్రాంతంలో జీవించి తన సిద్ధాంతాలను ప్రచారం చేశాడు.

పాశ్చాత్య దేశాల్లో భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా పారిశ్రామికవేత్తలు, వర్తక ప్రముఖులు స్వేచ్ఛావ్యాపారం కొనసాగించడానికి, పాలకవర్గాల ఆటంకాలు తొలగించడానికి బ్రహ్మాండమైన ఉద్యమం ప్రారంభించారు. ఇందులో ప్రజల సహకారం పొందడానికొక నూతన తత్వశాస్త్రం అవసరమయింది. అదే ఫ్రెంచి భౌతికవాదం. మానవాభ్యున్నతికి మతం మూఢనమ్మకాలు ఆటంకమని వారి వాదన. రాజు దైవాంశ సంభూతుడనే అభిప్రాయాన్ని వారు ఎదుర్కొన్నారు. స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరత్వం అనే నినాదాలతో ఫ్రెంచి విప్లవానికి నాయకత్వం వహించిన పెట్టుబడిదారీవర్గానికి పై సిద్ధాంతాలొక సాధనంగా వినియోగపడ్డాయి. ఫ్రెంచి భౌతికవాదం ఆనాటి భూస్వామ్య వ్యవస్థను నిర్మూలించి, పెట్టుబడిదారీ వ్యవస్థను నెలకొల్పడంలో విప్లవపాత్ర వహించింది.

కాని, అధికారాన్ని హస్తగతం చేసుకున్న పెట్టుబడిదారీ వర్గం స్వాతంత్ర్యం, సమానత్వం సోదరత్వం అనే నినాదాలకు స్వస్తి చెప్పింది. అవి తమకేగాని, యితరులకు కానట్లు వ్యవహరించసాగింది. అట్టి పరిస్థితుల్లో కార్మికవర్గం పెట్టుబడిదారీ సమాజాన్ని నిర్మూలించి, సోషలిస్టు సమాజాన్ని నిర్మించేటందుకు మరో తత్వశాస్త్రం అవసరమయింది. మార్క్సు, ఎంగెల్సులు యీ అవసరాన్ని తీర్చారు. వారు కనిపెట్టిన

గతితార్కిక భౌతికవాదం ప్రపంచ కార్మికవర్గానికొక ఆయుధం. అన్ని విధాలైన దోపిడీవిధానాన్ని నిర్మూలించి, వర్గాలు, వర్గపోరాటం లేని సమాజాన్ని, విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని నెలకొల్పడమే దాని ఉద్దేశం. మార్క్స్, ఎంగెల్స్‌ల దృష్టిలో తత్వశాస్త్రం కేవలమొక సిద్ధాంతం మాత్రమే కాదు. మానవ శ్రేయస్సును కోరేవారందరి మనోవాంఛల కదొక నిర్దిష్టరూపం. మానవజాతి యొక్క ఆశయసిద్ధి కవసరమైన జ్ఞానాన్ని అది ప్రసాదిస్తుంది. కనుకనే మార్క్స్ యిలా అన్నాడు:

"ఇంతవరకు తత్వవేత్తలు ప్రపంచాన్ని గురించి వేర్వేరు విధాలుగా అర్థం చెప్పారు. మన కర్తవ్యం ప్రపంచాన్ని మార్చడం."

భారతదేశంలో పెట్టుబడిదారీవర్గం బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పెత్తనాన్నెదుర్కొని తమ అధికారాన్ని స్థాపించుకోడానికిక్కూడా ఒక తత్వశాస్త్రం కావలసివచ్చింది. ఒకవైపు బ్రిటిష్‌పాలకుల నెదుర్కోడానికి ప్రజాసామాన్యం యొక్క తోడ్పాటు వారి కవసరమయింది. కాని ఈ ప్రజాసామాన్యం విప్లవమార్గంలో పురోగమించకుండా, తమ చెప్పుచేతల్లో నడుచుకునేటట్లు చూడవలసివచ్చింది. ఇందుకు వారికి గాంధీవాదం ఉపయోగపడింది.

ఈ విధంగా మానవజాతి చరిత్రలో వివిధ సాంఘికశక్తుల మధ్య జరుగుతూ వచ్చిన సంఘర్షణ ఆయా తత్వశాస్త్రాలలో వ్యక్తమవుతూవచ్చింది.



# రెండవ అధ్యాయం

## భావవాదం - భౌతికవాదం

ప్రపంచాన్ని గురించీ, ప్రకృతిని గురించీ, మానవుని గురించీ, అర్థం చెప్పడంలో తత్వశాస్త్రజ్ఞుల దృక్పథాలు రెండు విధాలు: భావవాదం, భౌతికవాదం. ప్రపంచానికి మూలం భావమా? పదార్థమా? పదార్థం భావాన్ని ఆశ్రయించుకుని వుంటుందా, లేక భావమే పదార్థాన్ని ఆశ్రయించుకుని వుంటుందా - అనే ప్రశ్నకు భావవాదు లొకవిధంగాను, భౌతికవాదులు మరొక విధంగాను, సమాధానం చెబుతారు. వేర్వేరు దేశాలలోను, వేర్వేరు భాషలలోను వ్యాప్తంలో ఉన్న తత్వశాస్త్రాలన్నీ పై రెండింటిలో ఏదో ఒక శాఖకు చెందుతాయి. వివిధ పేర్లతో వ్యవహరింపబడే మతాలకు కూడా తత్వశాస్త్ర స్వభావం వుంది. అందుచేత అవికూడా ఏదో ఒక శాఖకిందికి వస్తాయి.

మానవుడు పంచేంద్రియాలద్వారా తెలుసుకోగల ప్రతి విషయం పదార్ధం. కుర్చీ, టేబులు, పుస్తకం, నీరు, గాలి, నిప్పు, భూమి, దీపం మొదలైనవన్నీ పదార్థం యొక్క వివిధ రూపాలు. వాటిని గురించిన జ్ఞానమే భావం. కుర్చీ పదార్థం యొక్క రూపం; ఆ కుర్చీని గురించి మనలో కలిగే జ్ఞానం భావం.

పదార్థానికీ, భావానికీ గల సంబంధం ఎట్టిదో తెలుసుకోడానికి మానవుడు మొదటినుంచీ ప్రయత్నిస్తూనే వున్నాడు.

ఆటవిక మానవుడు ప్రకృతితో జరిపే పోరాటంలో తన కర్థంకాని ఘటనలు జరిగినప్పుడు, వాటి వెనుక దేవుళ్ళు - దేవతలు ఉండేవారని, వారికి మానవాతీతమైన శక్తు లున్నాయనీ భావించేవాడు (ఉదా: అగ్నిదేవుడు, వాయుదేవుడు, వరుణదేవుడు వగైరా). వారిని నిత్యమూ ఆరాధించేవాడు. ఆ రోజుల్లో మనిషి చనిపోయినపుడు, అతని అవయవాలన్నీ మామూలుగానే ఉన్నప్పటికీ, ప్రాణం ఎందువల్ల

పోయిందో తెలుసుకోలేక, ప్రతి శరీరంలోను 'ఆత్మ' ఒకటి వుంటుందనీ, అది ఎవరికీ కనబడదనీ, మనిషి. చనిపోయినప్పుడు ఈ 'ఆత్మ' శరీరాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోతుందనీ భావించేవాడు. ఇలాగే, మనిషి నిద్రించేటప్పుడు కలలో తన పూర్వీకుల్ని సందర్శించిన ఆటవిక మానవుడు తాత్కాలికంగా 'ఆత్మ' తన శరీరం నుండి వేరై, తన పూర్వీకుల్ని కలుసుకున్నట్లు ఊహించుకునేవాడు. తన శరీరం తాత్కాలికంగా చనిపోయినట్లు, 'ఆత్మ' మాత్రం బతికి ఉన్నట్లు భావించేవాడు.

ఆటవిక మానవుని స్వప్న జగత్తులో 'వేట, యుద్ధాలు మొదలైన ఘటనలు జరిగినప్పుడు కూడ యిట్టి అభిప్రాయాలే అతనిలో కలిగేవి.

ఆనాటి ఆదిమ తెగల నిర్మాణం కూడా యిట్టి విశ్వాసాలకు బలం చేకూర్చేది. ఉదాహరణకు ఆదిమ సమాజంలో ప్రతి తెగ, నాయకుని ఆజ్ఞలను విధిగా పాలించాలి. తెగ, నాయకుని మాట కెదురుచెప్పడం అసంభవమైన విషయం. తెగకూ, తెగనాయకునికీ మధ్యగల యిట్టి సంబంధాలు ఆనాటి మూఢవిశ్వాసాలను ధ్రువపరిచేవి. తెగనాయకుని ఆజ్ఞల ప్రకారం తెగ సభ్యులంతా నడుచుకొంటూన్నట్లే, ప్రపంచమంతా 'పరమాత్మ' చెప్పినట్లు నడుచుకొంటూందని ఆనాటి మానవుడు భావించేవాడు.

అందుచేత, భావవాదానికి మూలం మానవుని అజ్ఞానం, మూఢనమ్మకాలు అని చెప్పవచ్చు.

అయితే, శాస్త్రపరిశోధనల ద్వారా అనేక ప్రకృతి రహస్యాలకు అర్థం చెప్పగల ఆధునిక యుగంలోకూడా భావవాదం ప్రబలంగానేవుంది. ఇందుకు కారణం, వివిధ దశల్లో మానవసమాజంపై పెత్తనం వహిస్తూ వచ్చిన అభివృద్ధి నిరోధకవర్గాలు తప్పుడు సిద్ధాంతాలను ప్రోత్సహించడంతప్ప, మరొకటి కాదు.

భావవాదులు చెప్పేదాన్నిబట్టి ప్రపంచాని కంతకూ మూలం భగవంతుడు, లేదా పరమాత్మ. అతడే సర్వ జీవరాసులకు సృష్టికర్త. అందువల్ల పంచేంద్రియజన్యమైన జ్ఞానం సరియైనది కాదు. ఇంద్రియాతీతమైన ఆత్మచేతనే మనం యథార్థాన్ని తెలుసుకోల్గుతాం.

మన ఉపనిషత్తులలో యీ భావవాదం ఎక్కువగా కనిపిస్తుంది. కేనోపనిషత్తు పరబ్రహ్మవల్లనే జగత్తు భాసిల్లుతోందనీ, అది తర్కానికి

వశంగాదనీ, శారీరక, మానసిక వికారాలకది అతీతమనీ, మానవుడు వస్తుతః పరమాత్మ స్వరూపుడనీ, ఆత్మజ్ఞానంవల్ల పరబ్రహ్మాను గ్రహించవచ్చుననీ చెబుతోంది.

ముండకోపనిషత్తు "జ్ఞానం" అంటే పరమాత్మజ్ఞానమనీ, "విజ్ఞానం" లోకవిషయిక జ్ఞానమనీ వ్యత్యాసం చూపింది. పరమాత్మ దేశ కాలాలకు అతీతుడు; కాని జీవుడు దేశ కాల శరీరాదివిషయాలకు బద్ధుడు; అట్టి జీవునికి పరమాత్మజ్ఞానం కలిగితే బంధవిముక్తుడౌతాడు - అని ముండకోపనిషత్తు చెపుతోంది.

తైత్తిరీయోపనిషత్తు, పరమాత్మ సచ్చిదానంద స్వరూపుడనీ, ఆ ఆనందాతిరేకంలో జగత్తును సృష్టించాడనీ చెబుతోంది.

బృహదారణ్యకోపనిషత్తు జీవాత్మ, పరమాత్మలు ఒకటేననీ, దేశ కాల శరీరాదివిషయాలవల్ల జీవాత్మ ఖండరూపమయిందనీ వివరించింది.

దీన్నిబట్టి, వర్ణవ్యవస్థపై ఆధారపడ్డ భారత సామాజిక విధానం ఈశ్వరకల్పితమని భావవాదులు సిద్ధాంతీకరించారన్నమాట. దాన్ని మార్చడం ఎవ్వరితరం కాదని వారు వాదిస్తారు. అలా మార్చడానికి ప్రయత్నించడం భగవదేచ్ఛకు వ్యతిరేకమనీ చెబుతారు.

భౌతికవాదులు పై అభిప్రాయాలన్నిటినీ వ్యతిరేకిస్తారు. ప్రపంచానికి మూలం పదార్థమని వారు సహేతుకంగా రుజువుచేస్తారు. మనం నివసిస్తున్న భూమి కొన్ని లక్షల సంవత్సరాల క్రితం సూర్యునిలో అంతర్భాగంగా ఉండేది. అది సూర్యుని నుంచి వేరైనపుడు ఒక అగ్నిగోళంగా ఉండేది. ఆ వేడి క్రమంగా చల్లారి జీవరాసులు పెరగ నారంభించాయి. మానవుడు యితర జీవకోటితోబాటు ఏకకాలంలో ఉద్భవించలేదు. అనేక పరిణామదశలు దాటి యిప్పటిరూపం ధరించాడు. ఈ విషయాన్ని డార్విన్ తన పరిశోధనలద్వారా రుజువుచేశాడు. అంటే, భౌతికవాదం శాస్త్రపరిశోధనల ద్వారా భావవాదుల సిద్ధాంతాలను ఖండించగల్గుతోంది. ప్రపంచం ఈశ్వరకల్పితమనే నమ్మకాన్ని భౌతికవాదం పటాపంచలు చేస్తోంది.

సైన్స్ అభివృద్ధిచెందినకొద్దీ, పదార్థానికి మూలం అతిసూక్ష్మమైన అణువులని శాస్త్రజ్ఞులు తెలుసుకున్నారు. ప్రతివస్తువులోను ఆ వస్తువుయొక్క గుణాలనుబట్టి అణువులు వేర్వేరు విధాలుగా వుంటాయనీ, ప్రతి అణువు కొన్ని పరమాణువుల సముదాయమనీ, ఒక్కొక్క

పరమాణువులో ఎలక్ట్రాన్‌లు, ప్రోటాన్‌లు అను రెండు పరస్పర వ్యతిరేకమైన విద్యుత్ రూపాలు ఎడతెగకుండా విపరీతమైన వేగంతో ఒకదానిచుట్టూ ఒకటి తిరుగుతూ వుంటాయనీ కనుగొన్నారు. మనకు వివిధ రూపాలలో కనబడుతున్న పదార్థం యీ పరమాణువులవల్లనే నిరంతర గమనాన్ని కలిగియుంటుందని రుజువుచేశారు.

అంతేకాదు, ప్రపంచంలో వివిధ ఘటనలమధ్య గల సంబంధాన్ని, ప్రకృతి నియమాలను తెలుసుకోవడంద్వారా, మానవుడు తన జీవితాన్ని సౌఖ్యవంతం చేసుకోగల్గుతున్నాడు. ఆనకట్టలు కట్టడంవల్ల నదీజలాన్ని పంటల కుపయోగించుకోవడ మెలాగో మనకు తెలుసు. అంటువ్యాధుల నిర్మూలనకై వైద్యశాస్త్రజ్ఞు లనేక మందులు కనిపెట్టారు. విద్యుచ్ఛక్తివల్ల మన జీవితాన్ని అనేకవిధాలుగా సౌఖ్యవంత మొనర్చుకుంటున్నాం. ఆటంశక్తితో ఇసుక ఎడారుల్ని పంటభూములుగా మార్చవచ్చు. వర్షాలు కురియని ప్రాంతాల్లో కృత్రిమవర్షాలు కురిపించవచ్చు. ప్రపంచాన్ని సృష్టించినది పరమాత్మ అనీ, అది మార్చ శక్యంకాదనీ నమ్మితే యివన్నీ సాధ్యపడేవి కాదుకదా!

భావవాదులు ప్రపంచమంతా ఈశ్వరసృష్టి అని చెప్పడంతోనే సంతృప్తిచెందరు. ఇహలోక, పరలోక సంబంధాలనుగూర్చీ, మానవ ధర్మాలనుగూర్చీకూడ వారు సిద్ధాంతీకరిస్తారు. పురాణాల్లో స్వర్గాన్ని గురించి అనేక వర్ణనలున్నాయి. భగవంతునికి ప్రీతిగలిగించే సత్కర్మలు చేస్తే స్వర్గం లభిస్తుందనీ, సమస్తమైనకోర్కెలు తీర్చే కల్పవృక్షం స్వర్గలోకంలో వున్నదనీ పురాణాలు చెబుతున్నాయి. స్వర్గంలో సుందరమైన పచ్చికబయళ్ళు, ఉద్యానవనాలు, సెలయేళ్ళు వున్నాయని ఖురాన్ మతగ్రంథం చెబుతుంది. అడవి జంతువుల్ని వేటాడి మాంసభక్షణ చేసే రెడ్ ఇండియన్లకు స్వర్గమంతా అడవి జంతువులమయమేనట! పూర్వమొకప్పుడు ఒక క్రైస్తవ ఫాదరీ సైబీరియవ్ ప్రజల్ని క్రైస్తవమతంలో చేర్చుకోడానికి వెళ్ళాడట. సీల్ అను సముద్రజంతువుయొక్క మాంసం వారికి బహు యిష్టం. ఆ జంతువులు స్వర్గంలో పుష్కలంగా లభిస్తాయని క్రైస్తవ ఫాదరీ గ్యారంటీ యివ్వలేకపోయాడట. అందుచేత సైబీరియన్ ప్రజలు క్రైస్తవమతం పుచ్చుకోలేదట.

మానవసమాజం వర్గాలుగా విభజింపబడిన తర్వాత పేదరికానికి, దాస్యజీవితానికి గురిచేయబడే జనబాహుళ్యం యిహలోకంలో పొందలేని

అన్ని సౌఖ్యాలు స్వర్గలోకంలో అనుభవించవచ్చునని నమ్మించడానికే యిట్టి సిద్ధాంతాలు సృష్టించబడ్డాయి. ఫిక్టే అను జర్మన్ భావవాది స్వర్గాన్ని గురించి యింకా ఆశ్చర్యకరంగా వర్ణించాడు. స్వర్గలోకంలో మానవుడు ఒక కోర్కెను కోరుకోవడమంటేనే దాన్ని పొందడమట! అన్ని కోర్కెలనూ తీర్చే చింతామణి, కల్పవృక్షం స్వర్గంలో వున్నాయని హిందూమతంకూడా చెబుతోంది.

అయితే, పేదల రక్తాన్ని పీల్చి పిప్పిచేసే దోపిడీ వర్గాలు భూలోకంలోనే సర్వసౌఖ్యాలు అనుభవించడం జరుగుతోంది. దీన్ని సమర్థించడానికి తత్వవేత్తలు, మతస్థాపకులు నరకాన్నికూడా సృష్టించారు. ఇహలోకంలో పాపకర్మలు చేసేవారు పరలోకంలో నరకబాధ లనుభవిస్తారని శాసనం చేశారు. అట్టి నరక మెలా ఉంటుందో వర్ణనలు చేశాడు.

భారతదేశంలో - ముఖ్యంగా హిందువుల్లో - కర్మ సిద్ధాంతం మానవుని జీవితంమీద బలీయమైన ప్రభావం కలిగియుంది. దీనిప్రకారం ఎవరైనా ధర్మహాని చేస్తే, ఆ దోషిని ధర్మమే శిక్షిస్తుంది. ప్రతి మానవుడు పూర్వకర్మయొక్క ఫలం అనుభవించాలి. పుణ్యకర్మ చేస్తే సౌఖ్యం, పాపకర్మ చేస్తే దుఃఖం తప్పవు. దీని అర్థం, మానవునికి బాధాకరంగా ఉండే ప్రస్తుత పరిస్థితుల్ని మార్చనవసరంలేదని బోధించడమేగదా! వర్ణవ్యవస్థపై ఆధారపడ్డ దోపిడీ సమాజాన్ని నిలబెట్టియుంచడానికి సృష్టింపబడిన సిద్ధాంతమే కర్మసిద్ధాంతం.

భౌతికవాదు లిట్టి మూఢనమ్మకాలను శాస్త్రపరిశోధనలద్వారా చీల్చి చెండాడుతారు. సర్వసౌఖ్యాలు యిహలోకంలో అనుభవించవచ్చునని వాదిస్తారు. అందుకవసరమైన సాధనసంపత్తికూడా మన కందుబాటులోవుందని రుజువుచేస్తారు.

అయితే, కొందరు భావవాదులు భగవంతుని గురించిగాని, ఇహలోక-పరలోక సంబంధాలను గురించిగాని ఎత్తుకోరు. ఉదాహరణకు శంకరాచార్యుని మిథ్యావాదం తీసుకుందాం. దీనిప్రకారం ప్రపంచమంతా బ్రహ్మస్వరూపం. అయితే అజ్ఞానంవల్ల మన మీ విషయాన్ని తెలుసుకోలేకపోతున్నాం. అసలు వస్తువును తెలుసుకోలేకపోవడమే అజ్ఞానం. పంచేంద్రియ జన్యమైన జ్ఞానం జ్ఞానమేకాదు. గారడీవాడు చేసిన రూపాయలు పైకి రూపాయలవలె కన్పించవచ్చు. కాని అవి

రూపాయలుకావు. అందుచేత మనకు కనబడే బాహ్యప్రపంచమంతా మాయ. పంచేంద్రియాల కతీతమైన ఆత్మచేతనే యథార్థాన్ని తెలుసుకోగల్గుతాం. దీన్నే మరోవిధంగా చెప్పాలంటే ప్రపంచమంతా మిథ్య; అలా మిధ్యఅని తెలుసుకోవడమే "జ్ఞానం". అట్టి జ్ఞానం శాశ్వతం, ఆది మధ్య లయ రహితం.

పాశ్చాత్యదేశాల్లో కూడా యిట్టి భావవాదులున్నారు. వారిలో ముఖ్యుడైన బెర్క్లీ ప్రపంచమంతా మాయ అని రుజువుచేయడాని కనేక గ్రంథాలు రాశాడు. ఆయన సిద్ధాంతం ప్రకారం భావమే పదార్థానికి మూలం. భావానికతీతమైన ప్రపంచమంటూ లేదు. ఉదాహరణకు, ఒక వెచ్చని గుడ్డ కప్పుకుంటే మన శరీరం చెమటపోస్తుంది. ఆ బట్టనే చలిజ్వరంతో బాధపడుతూన్న రోగి కప్పుకుంటే చెమటపోయదు. కామెర్లరోగికి ప్రపంచమంతా పచ్చగా కనిపిస్తుంది. మన కంటికి ఎర్రగాను, గుండ్రబల్లమాదిరిగాను కనిపిస్తూన్న సూర్యుడు మరోవిధంగా వున్నట్లు శాస్త్రపరిశోధకులే చెప్పడంలేదా? భూమివిషయంలో అనేకమంది శాస్త్రజ్ఞు లనేక విధాలుగా అర్థం చెప్పలేదా? అందుచేత, పంచేంద్రియజన్యమైన జ్ఞానం యథార్థం కాదు. మనోభావాలనుబట్టే పదార్థం వేర్వేరు గుణాలను కలిగియుంటుంది.

ఈ వాదన ఎంత తప్పో మన జీవితానుభవమే తేటతెల్లం చేస్తుంది. ప్రపంచమంతా మనోభావాలవల్లనే ఏర్పడుతోంటే ఒక వస్తువునుగూర్చిన మనోభావం మరో వస్తువునుగూర్చిన మనోభావంతో ఎందుకు భేదించాలి? ఇల్లు ఒకవిధంగాను చెట్టు మరోవిధంగాను, మనిషి యింకో విధంగాను యెందుకు కనబడాలి? సూర్యుడు పైకి గుండ్రబల్ల మాదిరిగాను, ఎర్రగాను ఉన్నట్లు కనిపించవచ్చు. అయితే, సూర్యునిగురించి మన ఇంద్రియాలకు తెలిసినజ్ఞానం సంపూర్ణమైనది కాకపోవడమే యిందుకు కారణం. శాస్త్రజ్ఞులు పరిశోధనల ద్వారా సూర్యుని వాస్తవగుణాలను తెలుసుకోగలిగారు. అంతేగాని సూర్యుడే మిథ్యఅని చెప్పలేదు! మనం చర్చించేది ఇంద్రియజ్ఞానం. ఒక్కొక్కప్పుడు తప్పుకావచ్చునా, లేదా అని కాదు. తప్పైనప్పుడు శాస్త్రపరిశోధనలద్వారా వాస్తవాన్ని తెలుసుకో గలుగుతున్నాం.

అంతేకాదు. భావవాదాన్ని గురించి దీర్ఘ చర్చలు జరిపే వారంతా తమ నిత్యజీవితంలో "భౌతికవాదులే." ఉదాహరణకు ఒక భావవాది, ఒక

భౌతికవాది ఒకరితోఒకరు చర్చ జరుపుకుంటూ, రోడ్డుమీద నడిచి వెళ్తున్నారనుకుందాం. ఎదురుగా ఒక బస్సు వస్తోందనుకుందాం. అప్పుడు భావవాది ఏంచేస్తాడు? బస్సు "మిధ్య" గనుక పక్కకు తొలగకుండా ఉండగలడా? ఎన్నటికీ అతడలా చేయడు. బస్సును అతడు యదార్థవస్తువుగానే భావిస్తాడు. దాన్నుంచి రక్షించుకోడానికి వైదొలగుతాడు. టైఫాయిడ్‌తో బాధపడే భావవాది చికిత్సకోసం డాక్టరువద్దకు వెళ్ళడా? కాబట్టి, ఒక అభిప్రాయం సరియైన దవునో, కాదో తెలుసుకోడానికి జీవితానుభవమే చక్కని గీటురాయి.

మనం ప్రపంచమే మిథ్య అని నమ్మితే దాన్ని గురించి తెలుసుకోవడం వృధాప్రయాసగదా! దాన్ని మార్చడానికి ప్రయత్నించడం వెర్రితనంకాదా? అందుచేత, మిథ్యావాదం అభివృద్ధి నిరోధక సిద్ధాంతమని చెప్పక తప్పదు.

శాస్త్ర పరిశోధనలవల్ల మనకు తెలిసినది ఏమంటే, ప్రతి మనోభావం మెదడును ఆశ్రయించుకుని వుంటుంది. మెదడును శరీరంనుంచి విడగొడితే ఆలోచన నశిస్తుంది. ఈ విషయాన్ని జీవశాస్త్రజ్ఞులు రుజువుచేశారు. ప్రపంచంలో మెదడులేని జీవులూ వున్నాయి. మెదడు వున్న జీవులూ వున్నాయి. జీవరాసుల పరిణామక్రమంలో ఒకానొక దశలో మాత్రమే జీవికి మెదడు యేర్పడింది. మానవుని మెదడు యితర జీవరాసుల మెదడుకంటే పెద్దది, ఎక్కువ బరువైనది; దానిలోని జీవకణాలనిర్మాణం ఎక్కువ ఉన్నతమైనది. అత్యంత ప్రతిభావంతులైనవారి మెదడుకూ, మూఢుల మెదడుకూ వ్యత్యాసం మనకు స్పష్టంగా కనిపిస్తుంది. ఈ మెదడు పంచేంద్రియాల, నాడుల సహాయంతో పనిచేస్తుంది. వాటి ద్వారానే మెదడులో బాహ్యప్రపంచం ప్రతిబింబించి, భావాలను కలుగజేస్తుంది. అందుచేత, భావం పదార్థానికి ప్రతిబింబం మాత్రమే. దీన్నే ఎంగెల్స్ కిందివిధంగా వివరించాడు:

"మన పంచేంద్రియాలకు గ్రాహ్యమయ్యే భౌతిక ప్రపంచమంతా యథార్థం. దానిలో మనంకూడా ఒక భాగం మన చైతన్యం, మన ఆలోచనలు పైకి ఇంద్రియాతీతమైనవిగా కన్పడినా, అవి మెదడు అనే శారీరక అవయవాన్ని ఆశ్రయించుకుని వుంటాయి. పదార్థం మనస్సులో

ఉద్భవించినది కాదు. పదార్థ జనితమై, మహోన్నతస్థాయి నందుకొన్నట్టిదే మనస్సు."

మన ఆలోచనలు, అభిప్రాయాలు, కోర్కెలు, ఉద్రేకాలు నిరంతరం మార్పు చెందుతూ ఉంటాయి. మనకూ, మన పరిసరాలకూ మధ్యగల సంబంధాన్ని బట్టే అవి అలా మారుతాయి. దీన్నే మరోవిధంగా చెప్పాలంటే, మన జ్ఞానానికి మూలం మన ఆచరణ. కాని భావవాదులు దీన్నంగీకరించరు. జ్ఞానమే ఆచరణకు మూలమని వారివాదన. మనభావాలు ఆకాశం నుంచి వచ్చినవికావనీ, భౌతిక ప్రపంచంలో మనకుగల సంబంధాన్ని బట్టి అవి వస్తాయనీ భౌతికవాదులు రుజువుచేశారు. కొన్ని మనోభావాలు పైకెంత ప్రపంచాతీతంగా వున్నట్లు కనిపించినా, ఆదికాలంనుంచి నేటివరకూ మానవుడు అభివృద్ధిచెందిన దశలను పరిశీలిస్తే, సమస్తమైన భావాలూ ఆచరణవల్లనే ఏర్పడుతాయని స్పష్టమవుతుంది. ఒకవ్యక్తి బాల్యంనుంచి వృద్ధాప్యం వరకు పొందిన అనుభవాలను గమనిస్తేకూడ యిదే బోధపడుతుంది. మానుషశాస్త్రం, మానసికశాస్త్రం కూడా యీ సత్యాన్నే రుజువుచేస్తున్నాయి.

అయితే, భావాలు భౌతిక ప్రపంచంయొక్క ప్రభావంవల్ల కలుగుతాయన్నంతమాత్రాన సరిపోదు.

బాహ్య ప్రపంచమంటే అర్థం కొన్ని అచేతన పదార్థాల సముదాయంమాత్రమే కాదు. మానవ సమాజమంతా - అంటే మానవుల మధ్యగల అన్యోన్య సంబంధాలు కూడా- భౌతిక ప్రపంచంకిందకే వస్తాయి. జ్ఞానానికి మూలం ఆచరణ అని చెప్పినప్పుడు, సమాజంయొక్క జ్ఞానానికి కూడా మూలం సామాజిక ఆచరణయేనని మనం గ్రహించాలి. భూమినిగురించి, సూర్యునిగురించి, నక్షత్రాలనుగురించి మనం సంపాదించిన జ్ఞానం మనకూ, ప్రకృతికీ మధ్యగల సంబంధాన్ని బట్టి ఏర్పడిందని ఎలా చెబుతున్నామో, అలాగే సామాజిక వ్యవస్థనుగురించి, నీతి నియమాలనుగురించి, స్వాతంత్ర్యం మొదలైన ఆశయాలనుగురించి మనలో ఏర్పడు భావాలుకూడా మన చుట్టూవున్న సామాజికపరిస్థితుల్నిబట్టి, ఆ సమాజంలో మనకున్న స్థానాన్నిబట్టి వుంటాయి.

మానవ చరిత్రనుగాని, మన నిత్యజీవితంలో పొందే అనుభవాన్నిగాని జాగ్రత్తగా పరిశీలిస్తే, ప్రతి అభిప్రాయం, ప్రతి

సిద్ధాంతం, ప్రతి ఆలోచన కొంత చరిత్రను కలిగియుంటుందని గ్రహించగల్గుతాం. కొన్ని చారిత్రక పరిస్థితుల ప్రభావంవల్లను, మానవుని ఆలోచనాశక్తివల్లను అవి వుద్భవిస్తాయి. అవి మానవ జీవితంలో ఒక స్పష్టమైన ప్రయోజనాన్ని సాధించి తమ చారిత్రక కర్తవ్యాన్ని నెరవేరుస్తాయి. అవసరం తీరిన తర్వాత మాయమవుతాయి.

ఉదాహరణకు ఫ్రెంచి విప్లవంలో స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరత్వం అనే భావాలు ఫ్యూడల్ వర్గాన్ని అధికారంనుంచి కూలదోయడంలో పెట్టుబడిదారీవర్గాని కెంతో వుపయోగపడ్డాయి. తమ పోరాటంలో ప్రజాసామాన్యం కలిసి రావడానికవి అవసరమయాయి. కాని ఎప్పుడైతే పెట్టుబడిదారీవర్గం అధికారంలోకి వచ్చిందో, ఎప్పుడైతే ఆ వర్గంయొక్క ప్రయోజనాలు ఈడేరేయో, అప్పుడు ఆ భావాల ఉపయోగం పోయింది. అందుచేత పెట్టుబడిదారీవర్గం వాటిని విడిచిపెట్టవలసివచ్చింది. నాటినుంచి నేటివరకు పెట్టుబడిదారీవర్గపు దృష్టిలో స్వాతంత్ర్యం అంటే అర్థం తమ వర్గానికి స్వాతంత్ర్యం; సమానత్వమంటే అర్థం తమ వర్గానికి సమానత్వం; సోదరత్వమంటే అర్థం తమ వర్గానికి సోదరత్వం.

మన నిత్య జీవితానికి సంబంధించిన సమస్యలను పరిశీలించడంలో భౌతికవాదులు కొన్ని విశిష్టమైన శాస్త్రీయ పద్ధతు లవలంబిస్తారు. ఏ ఘటన అయినా జరిగితే, అది ఏ పరిస్థితులలో, ఎందుకు జరిగిందో పరిశోధిస్తారు. సూర్యగ్రహణం వచ్చినా, భూకంపం వచ్చినా, తోకచుక్క కనబడినా, కరువు సంభవించినా, యుద్ధం ప్రారంభమైనా శాస్త్రీయ పరిశీలనా పద్ధతులవల్ల వాటికి కారణాలు తెలుసుకుంటారు. ఉదాహరణకు యుద్ధాన్నే తీసుకుందాం. ప్రపంచం పుట్టినప్పటినుంచీ ఒండొరులు పోరాడుకోవడం, మానవ స్వభావమని భావవాదులంటారు. మరికొందరు, మానవుని దురాశ యుద్ధాలకు కారణమని వాదిస్తారు. ఇంకా కొందరు, యుద్ధం పైకెంత చెడ్డదిగా కనిపించినా భగవంతు డొక సదుద్దేశంతో దాన్ని తీసుకొచ్చాడంటారు. ఈ వాదన లన్నింటిలోను మనకొక విషయం స్పష్టంగా కనిపిస్తుంది. యుద్ధం రావడాని కసలు కారణమేమిటో, ఉభయపక్షాలలో ఏ ఏ వర్గాల కది అవసరమో వారు చెప్పరు.

నిరుద్యోగం, కరువు, ఆర్థిక సంక్షోభం మొదలైన సమస్యలపైకూడా భావవాదు లిట్టి దృక్పథాన్నే కలిగియుంటారు.

యుద్ధనివారణకు భావవాదులు చూపే మార్గమేమిటో కూడా పరిశీలిద్దాం. భగవంతుని ప్రార్థిస్తే యుద్ధాలు ఆగిపోతాయని వారి వాదన. ఒకవైపు భావవాదులు భగవంతుడే అన్నిటికి కారణమంటారు. మరొకవైపు ఆ భగవంతుడే తన ప్లానులను మార్చుకొనేటట్లు చేయవచ్చు నంటారు? అంతేకాదు. భగవంతుడు ఏ విధంగా యుద్ధాన్ని ఆపుజేయాలో ఈ భావవాదులకొక నిశ్చితాభిప్రాయం వుండదు. ఉదాహరణకు గతంలో అబిసీనియాయుద్ధం జరుగుతూన్నప్పుడు ఆ యుద్ధాన్ని ఆపుజేయవలసిందిగా క్రైస్తవులకు ప్రార్థనలు చేయమని పోప్ ఒక విజ్ఞప్తిచేశాడు. కాని ఏవిధంగా? బ్రిటన్, ఫ్రాన్స్ మొదలైన దేశాలు అబిసీనియాకు సహాయంచేసి ముస్సోలినీ సేనలపై చావుదెబ్బతీయడం ద్వారానా? లేక ముస్సోలినీ హృదయాన్ని కరిగింపజేసి, అతడు తన సేనలను ఉపసంహరించుకొనేటట్లు చేయడంద్వారానా? లేక అబిసీనియా ప్రజలు ఇటలీకి దాసోహం చేయడం ద్వారానా? అందుచేత ప్రార్థనపద్ధతి ప్రస్తుత పరిస్థితుల్ని స్వయంకృషి ద్వారా మార్చాలనే పంథాను వ్యతిరేకిస్తుంది. మానవుని క్రియాశూన్యునిగా చేస్తుంది.

భౌతికవాదు లిట్టి విధానాన్ని పూర్తిగా వ్యతిరేకిస్తారు. యుద్ధంవస్తే, దానికి కారణాలేమిటో అన్వేషిస్తారు. సమాజంలో ఏ వర్గాల ప్రయోజనాలకై యుద్ధం ప్రకటింపబడిందో పరిశీలిస్తారు. ప్రజాశ్రేయస్సుదృష్ట్యా ప్రజలందులో పాల్గొనడం మంచిదో, కాదో నిర్ధారణచేస్తారు. మంచిదైతే పాల్గొనమంటారు; కాకపోతే వద్దంటారు. ఉదాహరణకు అబిసీనియా యుద్ధానికి కారణం ఇటాలియన్ ఫాసిస్టుశక్తుల సామ్రాజ్య కాంక్ష. ఇటలీ ప్రజలు ముస్సోలినీ తరఫున ఆ యుద్ధంలో పాల్గొనడం ప్రజాశ్రేయస్సుకు వ్యతిరేకం. కాని అబిసీనియా చక్రవర్తి తన దేశస్వాతంత్ర్యం కొరకు ముస్సోలినీ సేనలతో పోరాడుతున్నాడు. ఆ పోరాటంలో అబిసీనియన్లు పాల్గొనడం ప్రజాశ్రేయస్సు దృష్ట్యా అవసరం.

ఇదేవిధంగా ప్రపంచానికంతకూ మహాప్రమాదం తెచ్చిపెట్టిన ఫాసిజాన్ని ప్రతిఘటించడానికి అన్ని దేశాల ప్రజలు పోరాడ్డం అవసరమయింది. చాంగ్-కై-షేక్ అమెరికన్ సామ్రాజ్యవాదుల

సహాయంతో చైనాప్రజల్ని బానిసత్వంలో ముంచడానికి అంతర్యుద్ధం ప్రకటించాడు. దానికి వ్యతిరేకంగా ప్రజావిముక్తిసేనలు యుద్ధం చేశాయి. అది చైనా ప్రజల స్వాతంత్ర్య యుద్ధం. అందుచేతనే ప్రజలంతా ప్రజావిముక్త సేనలకు సహాయంచేశారు. ఆ యుద్ధంలో చాంగ్-కై-షేక్ పక్షాన పోరాడడం ప్రజాశ్రేయస్సు దృష్ట్యా హానికరం.

ఈ విధంగా భౌతికవాదులు ప్రపంచంలో జరిగే ఘటనలను శాస్త్రీయదృక్పథంతో పరిశీలించి ప్రజాసామాన్యానికి మార్గం చూపుతారు. ఏ మార్గంద్వారా ప్రపంచాభ్యుదయం సాధింపబడుతుందో సకారణంగా తెలియజేస్తారు.



# మూడవ అధ్యాయం

## వాస్తవ విషయాలు, అభిప్రాయ ప్రకటనలు, అంతర్వైరుధ్యాలు

బాహ్య ప్రపంచమంతా యథార్థమని కిందటి అధ్యాయంలో తెలుసుకున్నాం. ఈ అధ్యాయంలో ప్రపంచానికి సంబంధించిన కొన్ని ప్రధానాంశాలను పరిశీలిద్దాం.

ప్రపంచంలో మనకు కనబడేవన్నీ వాస్తవ విషయాలు. అయితే అన్ని వాస్తవ విషయాలూ అందరికీ తెలియవు. సందేహాస్పదమైన కొన్ని వాస్తవ విషయాలను రుజువుల ద్వారా తెలుసుకోవచ్చును. కాని అలా తెలుసుకొనేటప్పుడు, మరికొన్ని వాస్తవ విషయాలుకూడా మనకు తెలిసివుండాలి. ఉదాహరణకు, "ఇది యిటుకలతో కట్టిన యిల్లు" అని అన్నప్పుడు, నిజంగా అది యిటుకలతో కట్టినయిల్లు అవునో, కాదో పరిశీలన ద్వారా తెలుసుకోవచ్చు. కాని అలా తెలుసుకొనే ముందు యిటుక ఎలా వుంటుందో అదివరకే మనకు తెలిసివుండాలి. ఒక యిటుకను పైకితీసి "ఇది యిటుక" అని మనం గుర్తుపట్టగలిగి వుండాలి. అది కూడా ఒక వాస్తవ విషయమనే సంగతి మనం మరచిపోగూడదు.

ఇలాగే మరికొన్ని వుదాహరణలు తీసుకుందాం. "రైలు ఆవిరిశక్తివల్ల యింజను సహాయంతో యినుపపట్టాల మీద అతివేగంగా పరుగెత్తుతుంది." ఇదొక వాస్తవ విషయం. దాన్ని పరిశీలించేటప్పుడు ఆవిరిశక్తినిగురించి, యింజనునుగురించి, యినుపపట్టాలనుగురించి, పరుగెత్తడాన్ని గురించి మనకు తెలిసివుండాలి. ఇవన్నీ వేరువేరు వాస్తవ విషయాలు. ఇలాగే "సమాజంయొక్క అభివృద్ధి ప్రజల ఉత్పత్తిశక్తి (Productive Capacity) పైన, వారి మానసిక శక్తిపైన, నిర్మాణశక్తిపైన

అధారపడివుంటుంది" అనే వాస్తవ విషయాన్ని పరిశీలించాలంటే వాటన్నిటినిగురించి మనకు అదివరకే తెలిసివుండాలి.

కొన్ని విషయాలు వాస్తవమైనవని కొంతవరకే మనకు తెలుస్తుంది. పూర్తిగా తెలుసుకోవడానికి పరిశోధనలు అవసరం. ఉదాహరణకు "సూర్యుని వేడిమి చాలాహెచ్చు. కొన్ని డిగ్రీల టెంపరేచర్‌లో కొన్ని వాయుపదార్థాలు కలిస్తే, సూర్యుడు అనేగోళం ఏర్పడింది." ఇది వాస్తవ విషయమే. కాని, ఆ వేడి ఎన్ని డిగ్రీల టెంపరేచర్‌లో వుంటుందో, ఏయే వాయుపదార్థాలు సూర్యునిలో వుంటాయో, వాటి బరువు ఎంతెంతో మొదలయిన వివరాల్లోకి మనం వెడితే, రుజువులు కావలసివస్తాయి.

మానవులు తిని కూర్చునే జీవులు కారు. నిరంతరం ఏదో ఒక పని చేస్తూవుండాలి. నీవు ఒక పుస్తకం చదువుతావనుకో; అప్పుడు నీవు నిన్నుగురించీ, పుస్తకాన్ని గురించీ ఒక వాస్తవిక విషయాన్ని సృష్టించావన్నమాటే. నేను కుర్చీమీద కూర్చున్నాను. కుర్చీ ఒక వాస్తవిక విషయం. దాన్ని సృష్టించేందుకు అనేకమంది కార్మికుల శ్రమ అవసరమయింది. అది కర్రతో చేయబడిన కుర్చీగనుక, కొంతమంది కార్మికులు అడవి నరికీ కలపకొట్టాలి. ఆ కలపను కొందరు రంపంతో కోయాలి. దీన్ని పడవలలో రవాణాచేయాలి. వడ్రంగులు ఆ కలపతో కుర్చీలు తయారుచేస్తారు. అందుచేత, "కుర్చీ మానవుని శ్రమఫలితం" అని సులభంగా మనం చెప్పగలం. అదేవిధంగా దాని వివరాలలోకి వెడితే, ప్రతి వాస్తవ విషయం అసంఖ్యాకమైన యితర వాస్తవిక విషయాలతో పెనవేసుకొని వుంటుంది.

మానవుడు తన కార్యాచరణ ద్వారా ప్రపంచంలోకి అనేక వాస్తవిక విషయాలను కొనివస్తున్నాడు. దీన్నే మనం "చరిత్ర" అంటున్నాం. అనగా చరిత్ర నిర్మాతలం మనమే నన్నమాట.

వాస్తవ విషయాలను గూర్చి వ్యక్తులు తెలియజేసే అభిప్రాయాలను అభిప్రాయప్రకటన లంటాం. వాస్తవ విషయాలవలెనే, అభిప్రాయ ప్రకటనలు కూడా నిజమో, కావో రుజువుల ద్వారా తెలుసుకోవచ్చు. ఉదాహరణకు, "నీవు యీ పుస్తకం చదువుతున్నావు" అనే అభిప్రాయప్రకటన నిజమైనదే. ప్రత్యక్షంగా నీవు దీన్ని చదువుతున్నావు. అందుచేత రుజువు అనవసరం. ఇలాగే, ఆంగ్లో - అమెరికన్

సామ్రాజ్యవాదులు మూడవ ప్రపంచం యుద్ధానికి సన్నాహాలు చేస్తున్నారు అనే విషయంకూడా నిజమేనని పరిశీలన ద్వారా చెప్పవచ్చు. 1947 ఆగష్టు 15 తర్వాత ఇండియాలో బ్రిటిష్‌వారి పెత్తనం పూర్తిగా నశించిందని ఎవరైనా చెబితే, అది వాస్తవం కాదని పరిశీలన ద్వారా రుజువుచేయవచ్చు. కొన్ని వాస్తవ ప్రకటనలు పరిస్థితుల్లో కలిగే మార్పువల్ల తమ వాస్తవికత్వాన్ని పోగొట్టుకుంటాయి. ఉదాహరణకు "దీపం ఎంత ఎక్కువ కాంతిగా వుంటే అంత చక్కగా మనం చూడగలం" అనే అభిప్రాయాన్ని తీసుకుందాం. వెలుతురు హెచ్చేకొద్దీ మనం చక్కగా చూడగలమనేమాట నిజమే. కాని, కొంతసేపట్లో ఆ దీపంయొక్క వెలుతురు మరీ ఎక్కువై, కళ్ళు మిరుమిట్లు కమ్ముతాయి. అప్పుడు మనకు ఏ వస్తువూ సరిగా కనబడదు. ఆ క్షణం నుంచి "దీపం ఎంత ఎక్కువ కాంతిగావుంటే, అంత తక్కువగా మనం చూడగల్గుతాం."

అందుచేత మనం దేన్నీ పరిస్థితులనుంచి దూరంచేసి చూడకూడదు. మనం ఎల్లప్పుడూ కింది విధంగా ప్రశ్నించుకోవాలి:

"ఏ పరిస్థితుల్లో అది నిజం? ఏ పరిస్థితుల్లో నిజం కాదు?"

మరో ఉదాహరణ తీసుకుందాం. "పుష్టికరమైన ఆహారం ఎంత ఎక్కువగా తింటే, శరీరానికి అంతబలం." బలహీనంగా వున్నవ్యక్తి పాలు, కోడిగుడ్లు, పండ్లు మొదలయిన పదార్థాలు తినగా తినగా, కండపుష్టి తప్పక కలుగుతుంది. కాని అదే అంతకంతకు ఎక్కువ తింటే, అజీర్తిరోగం పట్టుకొని బలహీనుడవుతాడు.

"చేంబర్లేనుపాలసీ బ్రిటిష్‌సామ్రాజ్యాన్ని బలపరిచేటందుకు ఉద్దేశింపబడింది." కాని అందు కతడు తీసుకున్న చర్యలను పరిశీలిస్తే బ్రిటిష్ సామ్రాజ్యానికి పోటీగా ఏర్పడ్డ ఫాసిజాన్ని అతడు బలపరచాడని బోధపడకమానదు. చివరకు ఫాసిజం, బ్రిటిష్ సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నం చేయగల స్థితికూడి ఏర్పడింది. అందుచేత "చేంబర్లేనుపాలసీ బ్రిటిష్ సామ్రాజ్యాన్ని బలహీనపరచింది" అనడం కూడా నిజమే.

అందుచేత, ఏ విషయాన్ని గురించి అయినా మనం ప్రకటించే అభిప్రాయం సరియైనదిగా వుండాలంటే, మనలను మనం క్రింది విధంగా ప్రశ్నించుకోవాలి: "ఏ దృక్పథం నుంచి చూస్తే అది నిజం? ఏ దృక్పథం నుంచి నిజంకాదు?" ఒకే పరిస్థితిలో రెండు దృక్పథాలు

వుండడం సహజమేగనుక, ఆ అభిప్రాయం నిజమూ కావచ్చు, అబద్ధమూ కావచ్చు.

"అరటిపండు కంటె మామిడిపండు రుచి."

ఈ అభిప్రాయం నిజమో, కాదో తెలుసుకునేటందుకు ఒక్క మార్గమైనా లేదు. నేను నిజమంటాను. మీరు కాదంటారు. ఇలాంటివే అనేక ఉదాహరణ లీయవచ్చు.

"నాస్తికులు అవినీతిపరులు."

"నీవు రైతుసంఘంలో చేరకపోవడం సిగ్గుచేటు."

"గాంధీ అవతార పురుషుడు."

ఇవన్నీ కొంతమంది వ్యక్తులనుగూర్చి, కొన్ని పరిస్థితుల్ని గూర్చి మనకు వున్న అభిప్రాయాలు. వాటిని వెలిబుచ్చినవారి దృష్టిలో ఒక్కొక్క అభిప్రాయం ఎంతో ప్రాధాన్యత వహిస్తుంది. లేదా కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో అది ఎంత ప్రధానమైనదో తెలియపరుస్తుంది.

అయితే అభిప్రాయలు ఎప్పుడు, ఏ పరిస్థితుల్లో, ఎవరిచేత యివ్వబడ్డాయో తెలుసుకొంటే, వాటి నిజానిజాలు బోధపడతాయి. ఆ అభిప్రాయాలను వెలిబుచ్చిన వ్యక్తులు ఏ వర్గానికి చెందినవారు? ఏ ఇతర వర్గాల అభిప్రాయాలతో వారు ఏకీభవిస్తున్నారు? ఏ పరిస్థితుల్లో వారు ఆ అభిప్రాయాలకు వచ్చారు? వాటిప్రకారం మిగతావారంతా నడిస్తే ఎట్టి ఫలితాలు కలుగుతాయి- మొదలైన విషయాలు ఆలోచిస్తే వాస్తవం తెలుస్తుంది.

కొన్ని అభిప్రాయలకు వాస్తవిక విషయాలకుండే విలువ ఏర్పడుతుంది. ప్రజలందరూ వాటిని అంగీకరిస్తారు. వాటి విలువను పురస్కరించుకుని కార్యాచరణకు దిగుతారు. ఉదాహరణకు "పసిబిడ్డను చిత్రవధచేయడం రాక్షసత్వం" అని అంటే అందరూ యీ అభిప్రాయంతో ఏకీభవిస్తారు. అలా ఏకీభవించిన వ్యక్తిని పిచ్చివా దంటాము; అందుచేత, కొన్ని అభిప్రాయాలకు మనం వాస్తవ విషయాలకు యిచ్చే విలువను యిస్తాం.

అయతే ఎల్లకాలం వారికి ఆ విలువ వుంటుందనుకోవడం పొరపాటు కొన్ని చారిత్రక పరిస్థితుల ప్రభావంవల్ల వాటి కా విలువ వచ్చింది. ఆ పరిస్థితులు మారితే. ఆ విలువ కూడా నశిస్తుంది. ఉదాహరణకు, "పసిబిడ్డను చిత్రవధ చేయడం రాక్షసత్వం" అని యీ

రోజున అంగీకరించే ఒకవ్యక్తి దేశ రక్షణకై ఒక పట్టణంమీద బాంబులవర్షం కురిపించడం న్యాయమేనని చెప్పవచ్చు. అట్టి చర్యలవల్ల వందలాది పసిబిడ్డలు చిత్రవధ చేయబడే పరిస్థితి ఏర్పడినప్పటికీ, దాన్ని అతడు సమర్థించుతాడు. ఎందువల్ల? శత్రుమూకలను ఓడించడంలో ప్రజాశ్రేయస్సు యిమిడివుందని విశ్వసించడంవల్ల. అనగా చారిత్రకపరిస్థితిలో మార్పు వచ్చిందన్నమాట.

పై ఉదాహరణల్లో కొన్నిటివల్ల మనకు తెలిసేదేమంటే మన మొక అభిప్రాయం ప్రకటించేటప్పుడు ఏ వస్తువును గూర్చి, లేదా ఏ ఘటననుగూర్చి ఆ అభిప్రాయం యివ్వబడిందో ఆ వస్తువులో, లేదా ఆ ఘటనలో వైరుధ్యం వుండవచ్చు. ఒక వస్తువుగాని, ఒక వ్యక్తిగాని, ఒక వ్యవస్థగాని మార్పుచెందేటప్పుడు, రెండు పరస్పర వ్యతిరేకమైన లక్షణాలు ఒకదానితో ఒకటి సంబంధం కలిగివుంటూ, ఒకటి ఒకవైపుకూ, మరొకటి రెండవవైపుకూ లాగుతూవుంటే, అప్పుడు ఆ వస్తువులో, లేదా వ్యక్తిలో, లేదా వ్యవస్థలో అంతర్వైరుధ్యం (Internal Contradiction) వుందంటాం. ఉదాహరణకు "వయస్సు హెచ్చేకొద్దీ జీవితం తగ్గుతుంది." ఈ ప్రకటనలో స్పష్టంగా రెండు పరస్పర వ్యతిరేకమైన లక్షణాలు కనిపిస్తాయి. వయస్సు హెచ్చడమంటే అర్థం, పుట్టిన తర్వాత అన్ని ఎక్కువ సంవత్సరాలు జీవించియుండడ మన్నమాట. కాని ఆదే సమయంలో అతని జీవితకాలం తగ్గిపోతూంది. మనిషి పెరిగేకొద్దీ యీ రెండు వ్యతిరేక లక్షణాలు పెంపొందుతూ వుంటాయి. అయితే, రెండూ వేరువేరుగా వుండక ఒకదానితో ఒకటి పెనవేసుకొని వుంటాయి.

మరొక ఉదాహరణ తీసుకుందాం. పెట్టుబడిదారీ విధానం రెండు పరస్పర వ్యతిరేకమైన లక్షణాలను కల్గియుంది. లాభాలకోసం కార్మికుల్ని దోచుకునే పద్ధతిపై అది ఆధారపడి వుంది. ఆధునిక యంత్రాలవద్ద పనిచేసేటందుకు విద్య, విజ్ఞానంగల కార్మికులు దానికి అవసరం. కాని ఆ కార్మికులు అంతకంతకు రాజకీయంగా చైతన్యవంతులయి, పెట్టుబడిదారీ విధానాన్ని కూలదోసేటందుకు సంఘటితులౌతున్నారు. అనగా, ఒకే వ్యవస్థలో రెండు పరస్పర వ్యతిరేకశక్తులు ఉన్నాయన్నమాట. మనం "వర్గపోరాటాన్ని" గురించి మాట్లాడుతున్నామంటే, యీ పరస్పర వ్యతిరేకశక్తులమధ్య జరిగే సంఘర్షణను గూర్చి మాట్లాడుతున్నా

మన్నమాట. ఈ రెండు వ్యతిరేకశక్తులు వేర్వేరుగా, స్వతంత్రంగా వుండవు. ఒకదానితో ఒకటి పెనవేసుకుని వుంటాయి.

రెండవ ప్రపంచయుద్ధానికి ముందు, పది సంవత్సరాలుగా బ్రిటీషు ప్రభుత్వం అవలంబించిన విదేశాంగ విధానంలో కూడా యిట్టి అంతర్వైరుధ్యాన్ని చూడవచ్చు. ఒకవైపు దినదినాభివృద్ధి చెందుతూన్న ప్రపంచ కార్మికోద్యమాన్ని అణచేటందుకు కలిసి పనిచేయాలనే వాంఛ పెట్టుబడిదారీ దేశాల్లో ప్రబలమవుతోంది. మరోవైపు వాటిమధ్య పోటీ ఎక్కువవుతోంది. ఈ రెండు లక్షణాలు ఆనాటి యూరపియన్ ఆర్థిక, సామాజిక పరిస్థితుల్లోని అంతర్వైరుధ్యం. అప్పటి యూరపియన్ వ్యవస్థ మార్పు చెందనంతకాలం యీ వైరుధ్యం తప్పదు. అలాంటి పరిస్థితుల్లో బ్రిటన్ ఎట్టి విధాన మవలంబించినా, అది పై రెండు వైరుధ్యాలలో యేదో ఒకదానివైపు మొగ్గుచూపడం తప్పదు. ఉదాహరణకు: చాంబర్లేను పాలసీ, సోవియటు రష్యాకు వ్యతిరేకంగా వివిధ సామ్రాజ్యదేశాల మధ్యగల పోటీని తగ్గించ ప్రయత్నించింది. ఐక్యతకై కృషి చేసింది. స్పెయిన్‌లో హిట్లర్, ముస్సోలినీలు ప్రోత్సహించిన అంతర్యుద్ధంపట్ల, బ్రిటన్ తటస్థవిధాన మవలంబించింది. ఈ విధంగా ఫాసిస్టు దురాక్రమణకు ప్రోత్సాహమిచ్చింది. అలాగే మ్యూనిక్ ఒడంబడిక ద్వారా హిట్లర్‌కు జెకొస్లొవేకియాలోని ప్రధాన భూభాగాలను కట్టబెట్టింది. కాని కొంతకాలమయేసరికి ఫాసిస్టుశక్తులు బ్రిటన్, ఫ్రాన్సులమీద దండయాత్ర చేయగలశక్తిని సంపాదించాయి. వలస దేశాలుకూడా ఫాసిస్టు దురాక్రమణకు గురయే ప్రమాదం ఏర్పడింది. ఈ క్లిష్ట పరిస్థితుల్ని చర్చిల్ ప్రభుత్వం ఎదుర్కోవలసి వచ్చింది. హిట్లర్ 'సోవియట్ యూనియన్‌మీద దాడి ప్రారంభించిన వెంటనే, చర్చిల్ సోషలిస్టు రష్యాతో చేతులు కలిపాడు. కాని ఆనాటి యూరపియన్ ఆర్థిక, సామాజిక వ్యవస్థ మార్పు చెందలేదు. అందువల్ల, చర్చిల్ పాలసీవల్ల కూడా ఉపయోగం లేకపోయింది. అందుచేత ఫాసిస్టు దురాక్రమణకు ప్రోత్సాహ మీయడం ద్వారా పెట్టుబడిదారీవ్యవస్థను బలపరచుకో ప్రయత్నించడమంటే అర్థం దాన్ని బలహీనపరచుకోవడమే. ఇలాగే సోషలిస్టు రష్యా సహాయంతో పోటీ సామ్రాజ్య దేశాలను (జర్మనీ, ఇటలీ, జపాన్) ఎదుర్కోవడం ద్వారా పెట్టుబడిదారీవ్యవస్థను బలపరచుకో ప్రయత్నించడమంటే కూడా తమ్ము తాము బలహీనపర్చుకోవడమే.

ఇలాంటి వైరుధ్యాలు మన నిత్య జీవితంలో అనేకం కనబడుతూవుంటాయి. కాని తరచు వాటిని మనం గుర్తించం. ఉదాహరణకు, మనం ఒక సమస్యనుగూర్చి తెలుసుకుంటున్నామను కొందాం. అలా తెలుసుకునేకొద్దీ, మనలోని అజ్ఞానాన్ని కూడా గుర్తించగల్గుతాం. ఏ విషయాన్నైనా పరిశీలించేటప్పుడు మనలో జ్ఞానం, అజ్ఞానం కూడా ఏకకాలంలో గోచరిస్తాయి.



# నాలుగవ అధ్యాయం

## గుణం, పరిమాణం

పదార్థం అనేక రూపాలలో ప్రత్యక్షమవుతుంది. ప్రతిరూపం ఒక ప్రత్యేకగుణాన్ని, లేదా గుణాలను కలిగివుంటుంది. ఉదాహరణకు గాజుపెంకు పెళుసుగా వుంటుంది. పంచదార తియ్యగా వుంటుంది. గులాబీపువ్వు ఎర్రగాను, పరిమళం యిచ్చేదిగాను వుంటుంది. సంగీతం ఆనందాన్ని యిస్తుంది. ఘన పదార్థాలకు, ద్రవ పదార్థాలకు, వాయు పదార్థాలకు, విద్యుచ్ఛక్తికి వేర్వేరు గుణాలు వుంటాయి. పదార్థం యొక్క వివిధ రూపాలతో మనకు సంబంధం యేర్పడ్డప్పుడు వాటి గుణాలు మనకు తెలుస్తాయి.

కొన్ని గుణాలు యితర గుణాలకంటె మనతో ఎక్కువ సంబంధాన్ని కలిగివుంటాయి. అలాంటప్పుడు అవి మనలో బలమైన భావోద్రేకాలను కలిగిస్తాయి. ఉదాహరణకు, “ఈ పాట చాలాబాగుంది” అని మనం అంటే, మనలో సంతోషం అనే గుణం వుద్భవించినదన్నమాట. అలాగే, ఒక వ్యక్తి యిచ్చిన ఉపన్యాసం ఉద్రేకపూరితంగా వుందంటాం. అంటే ఆ ఉపన్యాసంయొక్క గుణాన్ని మనం వర్ణిస్తున్నామన్నమాట.

కొన్ని గుణాలకు మళ్ళీ గుణాలుంటాయి. ఉదాహరణకు ఆలోచించడం, భావోద్రేకాలను పొందడం మానవుని గుణాలు. కాని కొందరి ఆలోచనలు స్పష్టంగాను, మరికొందరివి తికమకలుగాను వుండవచ్చు. ఒకవ్యక్తి కోపంగాను మరోవ్యక్తి విచారంగాను వుండవచ్చు.

వస్తువులకు, జీవరాసులకు మాత్రమే కాకుండా, పరిస్థితులకుకూడా గుణాలుంటాయి. ఉదాహరణకు హిట్లరు సోవియట్ యూనియన్‌మీద దండయాత్ర ప్రారంభించినప్పటి పరిస్థితి, జపాన్ సేనలు ఇండియా సరిహద్దులను సమీపించినప్పటి పరిస్థితి,

యుద్ధానంతరం భారతదేశంలో విప్లవవెల్లువ కట్టలుతెగి ప్రవహించినప్పటి పరిస్థితి, నెహ్రూ ప్రభుత్వం 1948లో ప్రారంభించిన పైశాచిక నిర్బంధవిధానం - ఇవన్నీ వేరు వేరు గుణాలను కలిగివున్నాయి. ఆయా పరిస్థితులతో స్వయంగా సంబంధంగలవారు వాటి గుణాలను యెంతో వివరంగా వర్ణించగలరు.

ఒక కుర్చీనిగాని, ఒక యింటినిగాని, ఒక పాటనుగాని · మనం యెంత నిశితంగా పరీక్షించగలమో, అంత నిశితంగాను వస్తువుల గుణాలను, పరిస్థితుల గుణాలనుకూడా పరీక్షించవచ్చు.

శాస్త్రపరిశోధకులు కొన్ని గుణాలను కొలవట మెలాగో కనిపెట్టారు. ఉక్కుయొక్క గట్టితనాన్ని, దీపంయొక్క వెలుతురునూ, శబ్దంయొక్క యెక్కువ తక్కువలను, విద్యుచ్ఛక్తి యొక్క ఎనర్జీని మనం కొలవవచ్చు. దీన్నే గుణాల యొక్క పరిమాణాన్ని కొలవడం అంటాం. బట్టలతాను యొక్క పొడవును కొలిచేటప్పుడు గజంబద్దను మన మొక యూనిట్‌గా వుపయోగిస్తున్నాం. అలాగే పై గుణాలను కొలవడానికి కూడా వేర్వేరు యూనిట్లు వున్నాయి.

అయితే కొన్ని గుణాల పరిమాణాన్ని కొలవడం కష్టం. ఉదాహరణకు: "రామారావుకంటె వెంకట్రావు కోపంగా వున్నా"డని మన మన్నప్పుడు, కోపానికి ఎక్కువ తక్కువలుంటాయనేది స్పష్టం. కాని ఆ కోపాన్ని కొలవడం మాత్రం దుస్సాధ్యమైనపని. కోపాన్ని కొలిచే సాధనాన్ని కనిపెట్టడం సులభం కాదు. అలాగే "ఈ పాటకంటె ఆపాట బాగుంది" అన్నా, "ఈ వుపన్యాసం ఆ వుపన్యాసంకంటె వుద్రేకపూరితంగా వుంది" అన్నా, వాటిని కొలవడం కష్టం. దీన్నిబట్టి మనకు తెలిసేది ఏమంటే, ఒక పరిస్థితికి సంబంధించిన వాస్తవవిషయాల గుణాలను కొలవడంకంటె, ఆ పరిస్థితికి సంబంధించిన అభిప్రాయాల గుణాలను కొలవడం కష్టం. అయినప్పటికీ, వాటికికూడా కొన్ని గుణాలు వుంటాయనేదిమాత్రం స్పష్టం. ఎందుచేతంటే, గుణాలు లేనప్పుడు పరిమాణం వుండటం అసంభవం.

వచ్చే అధ్యాయంలో మనమంతా ఎలా ఆలోచిస్తామో ఎలా అభిప్రాయాల నేర్పరచుకొంటామో వివరింపబడుతుంది. ఆ వివరాల్లోకి వెళ్ళేముందు, ఆలోచనకు సంబంధించిన కొన్ని విషయాలు యిక్కడ తెలుసుకోవడం అవసరం. మొదటి విషయం ఏమంటె ఆలోచన,

భావోద్రేకం మానవుని లక్షణాలుమాత్రమే కావు. జంతువులకుకూడా కోపం రావడం, సంతోషం కలగడం చూస్తూనేవున్నాం. కుక్కను కొట్టడానికి రాయి విసరితే, ఆ రాయి ఎక్కడ పడుతుందో కుక్క వూహించగలుగుతుంది. కోతి ఒక ఉద్దేశ్యంతో సమగ్రమయిన ఒకప్లానును తయారుచేసి, దాన్ని ఆచరణలో పెట్టగల్గుతుంది. మెదడు అభివృద్ధి చెందేకొద్దీ, జీవరాసులు ఒక రూపంనుంచి మరో రూపంలోకి అంతస్థులవారీగా పరిణామంచెందేకొద్దీ వాటి ఆలోచనాశక్తికూడా అభివృద్ధి చెందుతుంది. శాస్త్రపరిశోధనల ద్వారా యీ విషయం రుజువయింది.

కొద్దో, గొప్పో ఆలోచనాశక్తిగల జంతువులన్నిటిలోను రెండు లక్షణాలు కనబడతాయి. మొదటిది అనుభవంద్వారా పాఠాలు నేర్చుకోవడం. రెండోది ముందేమి జరుగుతుందో వూహించడం, ఆ తరువాతదశ ముందు జరగబోయే ఘటనలను వూహించడంతోబాటు, ప్లానులువేయడంకూడా నేర్చుకోవడం. అనగా భవిష్యత్తును నిర్మించడమన్నమాట. ఆలోచనలకూ, ఆచరణకూ మధ్యగల సమన్వయాన్ని ఆధారంచేసుకొంటేనే గాని యిది సాధ్యంగాదు.

అందుచేత వాస్తవ ఘటనల కనుగుణ్యంగా మన ఆలోచన వున్నప్పుడే అది వాస్తవమైన ఆలోచన అవుతుంది. ఏ ఘటన జరుగుతూన్నట్లు మనం భావిస్తున్నామో, అది మన కండ్ల ఎదుట జరుగుతూవుండియుండాలి. దీన్ని మనం అడుగడుక్కీ పరీక్షించుకోవచ్చు. దీన్నే స్వాభావికమైన ఆలోచన అంటాం.

ఒకవ్యక్తి ఒక పనిని పూర్తిచేయడానికి ఎంత సొమ్ము ఖర్చు అవుతుందని అడుగుతాం. అప్పు డావ్యక్తి దాన్ని పూర్తి చేయడానికి ఎన్ని గంటలుపడుతుందో, ఎంత శ్రమ అవసరమవుతుందో వూహించుకుంటాడు. ఎంతనైపుణ్యం అవసరమో కూడా ఆలోచించుకుంటాడు. ఈ విధంగా అతడు అనేక దృక్పథాలనుంచి పరిశీలిస్తాడు. అప్పుడే అతని ఆలోచన సరియైనది, వాస్తమైనది అంటాం. ఒకవేళ ఆ పని ప్రమాదంతో కూడుకునివున్నదైతే, అలా ప్రమాదాలతో కూడకొనివున్న కొన్ని యాదృచ్ఛిక ఘటనలనుకూడ అతడు వూహించుకోవలసియుంటుంది. ఉదాహరణకు, "ఒక బండిమన్ను తవ్వడానికి ఎంత తీసుకుంటా"వని అడిగితే, ఆ పుట్టలో పాము

వుండవచ్చు గదా అని, అది తనను కరవవచ్చుననీ ఊహించుకుంటాడు. అందుచేత రెండురూపాయలో, మూడు రూపాయలో అడుగుతాడు. ఇలాగే మరొక ఉదాహరణ తీసుకుందాం. రైల్లో నుంచి దిగిన ఒక ప్రయాణీకుడు ఒక సూట్‌కేసుతో బయటికి రావడంచూస్తాడు ఒకకూలీ. ఆ ప్రయాణీకుడు మంచిదుస్తులు ధరించడం కనిపెట్టి ప్లాట్‌ఫారంమీద యితర కూలీ లేవరూ లేకపోవడం చూచి, మామూలుగా అడిగే రేటుకు బదులు ఎక్కువ యిమ్మంటాడు. అర్ధరూపాయకు బేరం పెడితే అరణాలనైనా యివ్వకపోతాడా? అని అతడు అనుకుంటాడు. అనగా ఆ కూలీ అన్ని దృక్పథాలనుంచీ ఆలోచిస్తాడన్నమాట. తాను అంచనావేసుకున్న ప్రకారం ఆ ప్రయాణీకుడు మామూలురేటుకంటె అదనంగా కొంత యిచ్చినట్లైతే ఆ కూలీ అంచనా సరియైనదన్నమాట.

ఈ విధంగా ముందు జరగబోయే యాదృచ్ఛిక ఘటనలను మనం వూహించుకొనేటపుడు మన ఆలోచనకు ఒక కొత్తగుణం (ఊహించేగుణం) ఏర్పడుతుంది. దీన్నే వూహాయుతమైన ఆలోచన అంటాం.

ఒక్కొక్కప్పుడు యిలాంటి ఊహాయుతమైన ఆలోచనలు వాస్తవపరిస్థితులకు భిన్నంగావుంటాయి. ఉదాహరణకు విష్ణుమూర్తికి నాలుగు చేతులు వున్నట్లు, రావణునికి పది తలకాయలు వున్నట్లూ మనం చిత్రాలలో చూస్తున్నాం. కాని ఏ చిత్రకారుడూ విష్ణుమూర్తినిగాని, రావణునిగాని చూచివుండడు. అందుచేత కొన్ని సందర్భాలలో మన ఆలోచనలు తప్పుకావచ్చు. ప్రపంచం మన కండ్లకు ఒక విధంగా కనిపిస్తుంటే, అది మరోవిధంగా వున్నట్లు చిత్రించుకోవడం జరుగుతూవుంటుంది. లేదా ప్రపంచం ఒకవిధంగా మారుతూంటే, మరోవిధంగా మారుతున్నట్లు మనం వూహించుకొంటాం. దీన్నే "ఊహలకు బానిసలం కావడం" అనీ, "గాలిమేడలు కట్టడం" అనీ అంటాం. ఒక వ్యక్తి ప్రస్తుతాన్నిగురించి, భవిష్యత్తునుగురించి తప్పు అంచనావేసి, చెడ్డగా ప్లానువేస్తేకూడా అతన్ని యిలాగే అంటాం.

మనం వూహాయుతమైన ఆలోచనలను, వూహాయుతమైన భావోద్రేకాలను సాధనాలుగా వుపయోగించి ప్రపంచంలో అనేక వాస్తవ ఘటనలు జరిగేలా చేయవచ్చు. అనేక కొత్త వస్తువులను సృష్టించవచ్చు; కొత్త విషయాలను కనిపెట్టవచ్చు; కొత్త సిద్ధాంతాలను ప్రతిపాదించవచ్చు.

కాని, అలా మనం చేయాలంటే, భవిష్యత్తులో జరగబోయే ఘటనలను ముందుగా మనం తెలుసుకోగల్గియుండాలి. అంతేగాక అలా తెలుసుకోవడంలో యే అనుభవం, యే జ్ఞానం మనకు ఉపయోగపడుతున్నాయో ఆ అనుభవాన్ని, జ్ఞానాన్ని ఆధారంచేసుకుని, కొత్త ఘటనలు జరిగేలా చేయడానికి శక్తివంతులమై యుండాలి. మన చర్యలు బాహ్యపరిస్థితుల కనుగుణ్యంగా వున్న పక్షంలో, అవి భవిష్యత్తును మార్చడానికి యెలా సహాయపడతాయో తెలుసుకొనేటందుకు వూహాశక్తి ఒక సాధనంగా వుపయోగపడుతుంది. మానవుడు ప్రాణంలేని ఒక అచేతనపదార్థం కాదు. తన వూహాశక్తి యొక్క సహాయంతో అతడు అనేక కొత్తవిషయాలను సృష్టించగలడు. అతడు తన ఆలోచనలను క్రియారూపంలో పెట్టకపోతే, నిరంతరం ఊహాగానంతోనే పొద్దుపుచ్చాలిగదా!

దీన్ని మనం గణితశాస్త్రంలోను, కళాప్రపంచంలోను బాగా చూడగలం. గణితశాస్త్రజ్ఞుడు తాను నిత్యమూ ప్రపంచంలో చూచే కొన్ని వస్తువులనుంచి కొన్ని భావాలు ఊహించుకుంటాడు. "గీత", "సున్న", "బిందువు", "కోణం" మొదలయినవన్నీ యిట్టి భావాల సంకేతాలు. వాటిమధ్యగల సంబంధాలను అతడు మాటల్లో వ్యక్తపరుస్తాడు. వాటి నన్నిటినీ తన ఊహాజగత్తులో కొన్ని సముదాయాలుగా చేర్చి (ఒక్కొక్కప్పుడు 'డయాగ్రముల'సహాయంతో) వాటిమధ్య గల సంబంధాలపై కొత్త సిద్ధాంతాలను సృష్టిస్తాడు. అవి చాలవరకు వాస్తవ ప్రపంచాని కనుగుణంగానే వుంటాయి. ఎందుచేతంటే, గణితశాస్త్రజ్ఞుల భావాలు వాస్తవ పరిస్థితుల్లోనే ఉద్భవిస్తాయి.

ఇదంతా వ్యూహాయుతమైన ఆలోచన. ఈవిధంగా గణిత శాస్త్రజ్ఞుడు ఒక విషయాన్ని సహేతుకంగా రుజువుచేశాడని అనుకుందాం. కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో ఒక విషయం ఫలానా విధంగా జరగక మానదు అని అతడు తెగేసి చెప్పగలుగుతాడు. అప్పుడతనిలో సహజంగా ఒకవిధమైన ఆనందం కలుగుతుంది. చర్చద్వారా ఒక రాజకీయసిద్ధాంతం సరియైనదని రుజువుచేసినప్పుడు మన కెలాంటి సంతోషం, ఉత్సాహం కలుగుతాయో అలాంటి సంతోషం, ఉత్సాహం గణితశాస్త్రజ్ఞునిలోకూడా కలుగుతాయి. ఈవిధంగా అతని ఆలోచన, భావోద్రేకం ప్రతి దశలోను ఒక దానితో ఒకటి పెనవేసుకునివుంటాయి. ఇది సహజం.

ఏదైనా ఒక దేశంయొక్క ఆర్థికాభివృద్ధికి ప్రణాళికలు తయారుచేసేటప్పుడు, లేదా ఒక పట్టణనిర్మాణానికి ప్లాను వేసేటప్పుడు, లేదా వాస్తవపరిస్థితుల కనుగుణ్యమైన ఒక రాజకీయ తీర్మానాన్ని తయారుచేసేటప్పుడు వూహాయుతమైన మన ఆలోచనద్వారా కొత్తఘటనలు జరిగేటట్లు చేయవచ్చు. అయితే అట్టి ఆలోచనతోబాటు భావోద్రేకంకూడా కలిసి వుంటుంది.

ఇదే కళాప్రపంచంలో యెలా వుపయోగపడుతుందో చూద్దాం. ఇక్కడ ప్రాధాన్యత ఆలోచనకుకాకుండా, భావోద్రేకానికి యివ్వవలసివుంటుంది. కళావేత్త తనలో ఒక ఉద్రేకం కలిగినప్పుడు, దానివల్ల ఉత్తేజం పొందుతాడు. తనవలెనే యితరులుకూడ ఉత్తేజితులుకావాలని వాంఛిస్తాడు. అందుకై అతడు ఒక క్రమపద్ధతిలో తన గతానుభవాన్ని భావోద్రేకాలతో సమన్వయపరుస్తాడు. అట్టి సమన్వయం యితరులలోకూడ తన భావాలవంటి భావాల్నే కలుగచేస్తుంది. అయితే, యిందు కతడు ఒక ప్రత్యేకమైన టెక్నిక్‌ను సాధనంగా వుపయోగిస్తాడు. ఉదాహరణకు గాయకుడు ఫిడేలునుగాని హార్మోనియమునుగాని, వీణనుగాని వుపయోగిస్తాడు. చిత్రకారునికి కుంచె, రంగులు కావాలి. శిల్పికి రాయి, యినుపసాధనాలు అవసరం. వీటిని ఉపయోగించే టెక్నిక్‌ను కళావేత్తలంతా (గణితశాస్త్రజ్ఞునివలె) అభ్యసించవలసి వుంటుంది.

కాని టెక్నిక్‌యొక్క ప్రధానోద్దేశంమాత్రం ప్రేక్షకులలో, లేదా శ్రోతలలో కళావేత్తల మనోభావాలు హత్తుకొనేటట్లుచేయడం. ఒక గేయాన్ని వినడంవల్లగాని, ఒక నాటకాన్ని చూడడంవల్లగాని మనలో తప్పక కొన్ని ఆలోచనలు బయలుదేరుతాయనేమాట నిజమే. కాని, కళారూపంయొక్క ప్రత్యేకలక్షణం యితరులలో కొన్ని విస్పష్టమైన భావోద్రేకాలను కలిగించడం. కళాసృష్టికీ, శాస్త్రపరిశీలనకూ తేడా యేమంటే ఒక కళారూపాన్ని చూచిన వ్యక్తిని మనం "యిది నీకు బాగుందా" అనీ, "యిది నీకు నచ్చిందా" అనీ ప్రశ్నిస్తాం. కాని ఒక శాస్త్రపరిశీలనను గూర్చి తెలుసుకున్న ఒక వ్యక్తిని మనం ఇది నీకు అర్థం అయిందా అని ప్రశ్నిస్తాం. రెండిటికీ చాలా తేడా వుందనే విషయం స్పష్టం. రెండు సందర్భాలలోను రెండు ప్రశ్నలూ అడగడం సంభవమే అయినా, మొట్టమొదట అడిగే ప్రశ్న విషయంలో మాత్రం తేడావుంది

తీరుతుంది. ఉదాహరణకు: సంగీతంలో కొన్ని రాగాలవిషయమై "నీకు అర్థం అయిందా" అనీ, కొన్ని చిత్రాలలోని భావం "నీకు బోధపడిందా"అనీ మనం అడుగుతూవుంటాం. టెక్నిక్‌ను పరిశీలించేటప్పుడు సాధారణంగా మనం అలా ప్రశ్నిస్తాం. కాని కళారూపాన్ని అంచనావేసేటప్పుడు, లేదా అభిప్రాయం యిచ్చేటప్పుడు "ఇది నీకు బాగుందా" అనే అడుగుతాం.

ప్రపంచంలో వాస్తవ విషయాలూ, అభిప్రాయ ప్రకటనలూ పరిస్థితుల్ని బట్టి ఎలామారుతూ వుంటాయో కిందటి అధ్యాయంలో చూచాం. అలాగే ఆలోచనలు, భావోద్రేకాలుకూడా సామాజికపరిస్థితులనుబట్టి మారుతూవుంటాయి. ఉదాహరణకు ఒక బట్టలమిల్లులో పనిచేసే కార్మికుడు అతి వేగంగా తిరిగే కొన్ని యంత్రాలవద్ద పనిచేస్తాడు. కొన్ని వందలు, లేక వేలమంది కార్మికులతో కలసి బట్టను వుత్పత్తి చేస్తాడు. రోజూ ఖచ్చితంగా కొన్ని గంటలు మాత్రమే పనిచేసి, నెల కొకసారి అతడు జీతం పుచ్చుకొంటాడు. ఒక అరగంట ఆలస్యంగా వెళితే, యజమాని జరిమానా విధిస్తాడు. ఇట్టి కార్మికులు, తామంతా కలసి ఆందోళన చేయడంవల్ల తమ కష్టాలను తొలగించుకోవచ్చునని తెలుసుకుంటారు. అంతా కలసి ఒక సంఘాన్ని స్థాపించుకుంటారు. ఇట్టి మిల్లు కార్మికుల భావనాప్రపంచం మొత్తంమీద ఒకే విధంగా వుంటుంది. సంభాషణల్లో వారు వెలిబుచ్చే అభిప్రాయాలు, పొందే భావోద్రేకాలు దాదాపు ఒకే విధంగా వుంటాయి. కాని ఒక పల్లెటూళ్ళో స్వంత అమగ్గంమీద పనిచేసుకుంటూ పొట్టపోసుకునే చేనేత కార్మికుని భావనా ప్రపంచం ఆవిధంగా వుండదు. అతడు చేసే పనిగంటలకు ఒక పరిమితి లేదు. ఖచ్చితంగా నెలకు యింత ఆదాయం వస్తుందనే హామీ లేదు. తాను, తన కుటుంబం కలిసి రాత్రింబగళ్ళు పనిచేస్తేనేగాని యిన్ని తిండిగింజలు దొరకవు. ఇలాంటి పరిస్థితుల్లో, చేనేత కార్మికుని భావాలు, ఉద్రేకాలు, మిల్లు కార్మికుని భావాలు, ఉద్రేకాలవలె వుండవుగదా!

మరొక ఉదాహరణ తీసుకుందాం. ఒక ప్రయాణీకుడు తన ప్రయాణ సందర్భంలో పల్లెటూరుమీదుగా వెళ్ళుతాడనుకుందాం. గ్రామస్థులు ఆ ప్రయాణీకుని ఊరు పేరు, వెళ్ళబోయే ఊరుపేరు సాధారణంగా అడిగి తీరుతారు. కొన్ని గ్రామాల్లో యింటిపేరు,

తండ్రిపేరు, వెళ్ళబోయే పనికూడా అడిగి తేల్చుకుంటారు. కాని పట్టణాల్లో యెవ్వరూ యిలాంటి ప్రశ్నలడగరు. పల్లెటూరు ప్రజలకు, పట్టణప్రజలకు మధ్యగల వ్యత్యాసం పై ప్రశ్నలలో స్పష్టంగా కన్పిస్తుంది. పల్లెటూరి ప్రజల సామాజిక స్థానాన్ని బట్టి వారి భావాలు, జీవితపు విలువలు ఆధారపడివుంటాయి; అలాగే పట్టణ పౌరుల విషయం.

ఇలాగే యిద్దరు బ్యాంకర్ల మధ్య జరిగే సంభాషణకు, ఇద్దరు కాలేజీ విద్యార్థులమధ్య జరిగే సంభాషణకు ఎంత తేడావుంటుందో మనం సులభంగా ఊహించవచ్చు. ఇద్దరు పాలేళ్ళ మధ్య సంభాషణకు, ఇద్దరు రైతులమధ్య సంభాషణకుకూడ యిలాగే తేడా కనబడుతుంది.

ఈ వ్యత్యాసం, 20 లేక 25 సంవత్సరాలనాటి జీవిత విధానాన్ని, నేటి జీవిత విధానాన్ని పోల్చిచూస్తే మరీ స్పష్టంగా కనిపిస్తుంది. అప్పటికి మోటార్లు, విమానాలు, రేడియోలు, సినిమాలు అంతగా వ్యాప్తిచెందలేదు. ప్రజల్లో చైతన్యం ఇప్పుడున్నంత యెక్కువగా లేదు. కాని యీ రోజున మనం చూచేదేమిటి? మన వాంఛలు, మన ఆశయాలు, మన జీవితపు విలువలు, మన అంచనాలు పూర్తిగా మారిపోయాయి. నేడు మనం అనేక విషయాలనుగూర్చి మాట్లాడుకుంటున్నాం. అనేక సమస్యలపై అభిప్రాయాలు ప్రకటిస్తున్నాం. అనేక ఘటనలపై ఉద్రిక్తుల మవుతున్నాం. వీటన్నింటినిగూర్చి మన తల్లిదండ్రులు ఊహించి గూడా వుండరు. 50 సంవత్సరాల క్రితం వ్యవసాయకూలీలు తమ సంఘాలద్వారా భూస్వాములపై పోరాటాలు జరపడం ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించియుండాలి. పాతిక సంవత్సరాలనాటి స్త్రీకి, నేటి స్త్రీకి పోలికేలేదు. పది సంవత్సరాల వయస్సుగలిగిన పిల్లలు రాజకీయచర్చలలో పాల్గొనడం పాతిక సంవత్సరాలనాడు సాధ్యమయేదా?

అందుచేత, మనం రెండు విషయాలను స్పష్టంగా జ్ఞాపకముంచుకోవాలి, మొదటిది: మనం ఏ దేశంలో, లేక ఏ కాలంలో నివసిస్తున్నామో, ఆ దేశంలో, లేదా ఆ కాలంలో నివసించే ప్రజలందరిమాదిరిగానే మనం కూడ ఆలోచిస్తాం. వారి మాదిరిగానే మనం వివిధ సమస్యలపై ఉద్రిక్తులమవుతాం. మన ఆలోచనలు, ఉద్రేకాలు శూన్యంలోవున్నట్లు వుండవు. ఏ సమస్యనైనా పరిష్కరించడానికి మనం తికమకలు పడుతున్నామనుకుందాం. కాని అదే సమస్యపై మనకు తెలియకుండా యింకా అనేకమంది ఆలోచిస్తున్నారని మనం

మరచిపోకూడదు. రెండవ విషయం: మన అనుభవంయొక్క పరిమితులలో ఏయే ఆలోచనలు, అంచనాలు ప్రత్యక్షమవుతాయో ఆ ఆలోచనలను, అంచనాలను దృష్టిలో ఉంచుకుని మనం వివిధ సమస్యలను పరిశీలిస్తాం. అనగా ఉదయం లేచినది మొదలు రాత్రి నిద్రపోయేవరకు మనం యేవర్గానికి లేక యేతరగతికి చెందిన ప్రజలతో మనం యెక్కువ సంబంధాన్ని కల్గివుంటామో, ఆ వర్గంయొక్క, లేదా ఆ తరగతియొక్క ఆలోచనలు, అంచనాలు, ఉద్రేకాలు మనలోకూడ ప్రతిబింబిస్తాయి.

కళావేత్తలు సృష్టించే కళారూపాలు, శాస్త్రవేత్తలు చేసే పరిశోధనలు, ఎంత వ్యక్తిగతమైనవిగా పైకి కన్పడినా, వాటిపై తప్పకుండా సామాజిక పరిస్థితుల ప్రభావం పడి తీరుతుంది. ఏ దేశంలోనైనాసరే, ఏ కాలంలోనైనాసరే అసంఖ్యాకమైన సమస్యలు ప్రజల ఆలోచనలను పురిగొల్పుతూవుంటాయి. వారిలో అవి ఉద్రేకాలను కల్గచేస్తాయి; సిద్ధాంత సమస్యలను గూర్చి శాస్త్రవేత్తలు, రాజ్యాంగసమస్యలనుగూర్చి రాజనీతిజ్ఞులు, కళలనుగూర్చి గాయకులు, చిత్రకారులు, నటకులు ఆలోచిస్తారు. సమాజంలోని ప్రతి ఒకవ్యక్తి, ఆ సమాజంలో యేర్పడ్డ చిక్కుల్ని గూర్చి ఆలోచిస్తూవుంటాడు. అనేక సమస్యలపై ఉద్రిక్తుడౌతాడు. ఈవిషయం అతనికి తెలియకపోవచ్చు. అది వేరే విషయం.

అందుచేత, ఒక శాస్త్రాన్నిగాని, ఒక కావ్యాన్నిగాని, ఒక చిత్రాన్నిగాని, ఒక నాటకాన్నిగాని మనం పరిశీలించేటప్పుడు ఏ సామాజిక పరిస్థితులలో అది రచించబడిందో జాగ్రత్తగా పరీక్షించాలి.



# ఐదవ అధ్యాయం

## ఆలోచన, భావోద్రేకం, కార్యాచరణ

ఇక్కడ మన మొక ప్రధాన విషయం జ్ఞాపక ముంచుకోవాలి. మన ఆలోచనలు యెన్నడూ ముక్కుకు సూటిగా వాటంతటవే వెళ్ళవు. ఒక వస్తువునుగురించిగాని, వొక పరిస్థితిని గూర్చిగాని మనం ఆలోచిస్తూన్నప్పుడు, మనలో. సహజంగా కొన్ని భావోద్రేకాలు కలుగుతాయి. అనగా అప్పుడు ఆ పరిస్థితి మనలో ఒక మార్పును తీసుకొస్తుందన్నమాట. అయితే మానవుడు ఎప్పుడూ ఏదో ఒకపని చేస్తూవుండాలి. అలా చేసే ప్రతి పనిని గురించి అతడు ఆలోచిస్తాడు. కొన్ని భావోద్రేకాలు పొందుతాడు. తర్వాత ఆచరణకు వూనుకుంటాడు. దేన్ని గురించి అతడు ఆలోచిస్తాడో, అది అతన్ని చికాకుపరుస్తున్నట్లయితే, దాన్ని మార్చడానికి అతడు ప్రయత్నిస్తాడు. అప్పుడు అతని భావోద్రేకం కూడ మారుతుంది. దానికొక కొత్తగుణం వస్తుందన్నమాట. ఎల్లప్పుడూ యిలా జరుగుతూవుంటుంది. దీన్నే మరోవిధంగా చెప్పాలంటే:

మొదటి దశ: బాహ్యప్రపంచం మానవునిలో ఆలోచనలను పురిగొల్పుతుంది.

రెండవ దశ: ఆ ప్రపంచం, ఆ ఆలోచనలు అతనిలో కొన్ని భావోద్రేకాలు కలుగజేస్తాయి.

మూడవ దశ: ఆ ప్రపంచాన్ని మార్చడానికతడు కొన్నిపనులు చేస్తాడు.

అయితే, యీదశలు మూడూ ఖచ్చితంగా ఒకదాని తర్వాత ఒకటి వస్తాయనుకోవడం పొరపాటు. మానవుడు ప్రపంచాన్ని మార్చేటప్పుడు, అత డా మార్పునుగూర్చి ఆలోచించడం, కొన్ని భావోద్రేకాలకు లోనుగావడం ఏక కాలంలోనే జరుగుతుంది. ఆతర్వాత అతడు మరొక

దశలోకి ప్రవేశిస్తాడు. ఈ రెండవదశ మొదటిదశకంటె పై మెట్టులో వుంటుంది. దీన్నే కింది విధంగా చూపవచ్చు:




పై మూడుదశలూ అంతకంతకు విస్తృతమయే ఒక వలయాకారంగా వున్నాయి. ఒక చుట్టు పూర్తి అయ్యేసరికి ప్రపంచం కొద్దో, గొప్పో మార్పుచెందడం, ఆలోచన-భావోద్రేకం పూర్వంకంటే అభివృద్ధి చెందడం, ఆచరణకూడ ఎక్కువ అనుభవయుతమైనది కావడం సంభవిస్తుంది. ప్రతిదశ అంతకుముందున్న దశను ఆధారంచేసుకొని, ఒక చుట్టు అంతకుముందున్న చుట్టును ఆధారంచేసుకొని అభివృద్ధి చెందుతుంది.

ఒక్కొక్కప్పుడు మన ఆలోచనలు తప్పవుతాయి ఎక్కడ అవి తప్పయాయో తెలుసుకోవడం కష్టంకాదు. మన ఆలోచనవల్ల, ఆచరణవల్ల ఏపని జరుగుతుందనుకుంటామో, ఆ అనుకొనేపని ఒకటీ, జరిగినపని మరొకటీ అయితే, అప్పుడు మనం ఆలోచన తప్పిందని తెలుసుకుంటాం; ఈవిధంగా మనం ఆలోచనలను ఎల్లప్పుడూ పదునుపెట్టుకుంటూవుంటాం. వాస్తవ పరిస్థితుల కనుగుణ్యంగా మన ఆలోచనలు వుండేటట్లు జాగ్రత్తపడతాం.

అనేక సందర్భాలలో మొదట ఆలోచనలు కాకుండా ఉద్రేకాలే మనలో కలుగుతూవుంటాయి. ఒకవ్యక్తి మన కండ్లయెదుట చెయ్యరానిపని చేస్తే, వెంటనే మనకు కోపం వస్తుంది. ప్రపంచంలో ఎక్కడైనా ప్రజాపక్షానికి విజయం లభిస్తే మనకు చెప్పరానంత ఆనందం కలుగుతుంది. ఇలాంటి సందర్భాలలో మన ఆలోచనలు తాత్కాలికంగా

కుంటువడతాయి. దీన్నిబట్టి ఆలోచనలకూ, ఉద్రేకాలకూ ఎంత దగ్గర సంబంధంవుంటుందో తెలుసుకోవచ్చు. అందుచేత మన ఆలోచనలు సరియైనవిగా వుండాలంటే ఎప్పటికప్పుడు మన ఉద్రేకాలనుగూర్చి జాగ్రత్తగా వుండాలి. ఈ ఉద్రేకాలు మొత్తం పరిస్థితిలో ఒక భాగమేనన్నవిషయం జ్ఞాపకముంచుకోవాలి. అప్పుడే, మనం ఉద్రేకాలకు బానిసలం కాకుండా వుంటాం.

పై విషయాలన్నిటిని మరొకసారి పరీక్షించినట్లయితే రెండు ప్రధానాంశాలు మనకు గోచరిస్తాయి. అవి పైకి స్పష్టంగానే కనబడవచ్చు. కాని తరచు వాటిని మనం గుర్తించం. మొదటిది ఏమంటే మనం ఆలోచించేటప్పుడు, భావోద్రేకాలు పొందేటప్పుడు, ఆచరణకు దిగేటప్పుడు, మనలోనే అనేకమార్పులు కలుగుతాయి. మనమీద బాహ్య ప్రపంచంయొక్క ప్రభావం ఎప్పటికప్పుడు కనబడుతూవుంటుంది. ప్రపంచాన్ని మార్చేటందుకు మనం చేసే ప్రతి పని మనలో మార్పు తీసుకొస్తుంది. ఆ మార్పు ఏమిటని మనలో మనం ప్రశ్నించుకుంటే, అది స్పష్టంగా కనబడుతుంది. ఉదాహరణకు, యింతవరకు మీరు యీ పుస్తకాన్ని చదవడంవల్ల, మీలో ఎలాంటి మార్పు కలిగిందో ఆలోచించుకుంటే, తప్పకుండా మీకు ఆ మార్పు కనబడుతుంది. దీన్ని చదవడంవల్ల మీలో సంతోషం కలిగిందా? లేక విసుగుపుట్టిందా? ఏ విషయంలోనైనా మీకు కొత్తజ్ఞానం కలిగిందా? కలిగితే అది ఎలాంటిది? మీరు నేర్చుకున్న కొత్త విషయం ఏమిటి? ఇదంతా మీలో కలిగినమార్పే. ఆ మార్పు ఎలాంటిదైనా, దాన్ని నిర్మూలించడంమాత్రం ఎవరితరమూ కాదు. దానికి మీరు కొన్ని కొత్త విషయాలుకూడా చేర్చగలరు.

ఇలాంటి మార్పులు మనందరిలోనూ నిరంతరం కలుగుతూవుంటాయి.

ఒక ఉదాహరణ తీసుకుందాం. సోవియట్ యూనియన్ హిట్లరుసేనలను ప్రతిఘటించడంలో అపూర్వమైన ప్రజ్ఞ, ధైర్యసాహసాలు ప్రదర్శించింది. ఇది చూచి అనేక దేశాల్లో ప్రజలు ఆశ్చర్యచకితులయారు. సోవియట్ యూనియన్‌ను గురించి తెలుసుకునేటందుకు వారిలో కొందరు కుతూహలపడ్డారు. "అలాంటి ప్రతిఘటన ఎలా సాధ్యమయింది? ఎందువల్ల ఆ దేశాన్నిగురించి అంచనావేయడంలో మనం పొరపాటుపడ్డాం?" అని ప్రశ్నించుకున్నది కొద్దిమంది మాత్రమే.

"నేను నా దృక్పథాన్ని మార్చుకున్నాను" అనుకొన్నది కొందరు మాత్రమే. వారు ఆ కొత్త దృక్పథంతో గత యూరపియన్ రాజకీయాలన్నింటినీ తిరిగి సమీక్షించుకొనివుండాలి.

ఫాసిజానికి వ్యతిరేకంగా అన్ని దేశాలలోను ఐక్య ప్రజా సంఘటనకొరకు కృషి చేయాలంటూ సోవియట్ యూనియన్ మొదట్లోనే ఎందుకు పిలుపు యిచ్చిందో, ఆంగ్లో-ఫ్రెంచి సామ్రాజ్యవాదులు ఎందుకు హిట్లరుతో కలిసి మ్యూనిక్ ఒడంబడికపై సంతకాలుచేశారో, సోవియట్ రష్యా హిట్లర్‌తో ఎందుకు నిరాక్రమణ ఒడంబడిక చేసుకుందో కారణాలు తెలుసుకునివుంటారు. ఈవిధంగా వారు పొరబాట్లతో కూడుకున్న తమ పాత దృక్పథాన్ని మార్చుకునేటందుకు ప్రయత్నించారు.

అందుచేత, మన ఆలోచనలు చిరకాలంనుంచీ పాతుకుపోయిన మూఢనమ్మకాల ప్రభావంవల్ల తరచు తప్పుమార్గాలు పట్టడం జరుగుతూవుంటుందన్నమాట.

ఇకరెండవవిషయం: ఏ పరిసరాలలో మన మున్నామో, ఆ పరిసరాలు మన చర్యలద్వారా మార్పుచెందుతాయి. మనం ఒక పని చేసినప్పుడు ప్రపంచమూ, ప్రపంచంతోబాటు మనమూ, కొద్దో గొప్పో మార్పుచెంది తీరుతాం. ప్రపంచంలో మనంకూడా ఒక భాగమేకనుక, మనలో కలిగే మార్పు ప్రపంచంలో కలిగే మార్పులో ఒకభాగమే. ఈ పుస్తకాన్ని చదవడంవల్ల మీలో కొంతమార్పు కలిగిందంటే ప్రపంచంలోకూడా మార్పు కలిగిందనేకదా అర్థం. అంతేకాదు. ఈ పుస్తకం రాయడంలో రచయితకూడా కొంతమార్పు చెందాడనే విషయం మరువకూడదు.

మన ఆలోచనల్లో మొట్టమొదటిదశ ఒక వస్తువునుగాని, ఒక సంఘటననుగాని, ఒక సిద్ధాంతాన్నిగాని గుర్తుపట్టడం. అలా గుర్తుపట్టగానే, మనం అదివరకు ఎరిగివున్న యితర వస్తువులవలె, యితర ఘటనలవలె, యితర సిద్ధాంతాలవలె అవి వున్నాయంటాం. "ఇది ఒక పుస్తకం", "అది ఒక ఊరేగింపు", "అది భావవాదం" అని మనం అన్నప్పుడు అనేక యితర పుస్తకాల పోలికలు, ఊరేగింపుల పోలికలు, భావవాదంయొక్క పోలికలు వాటిలో మనకు కనబడ్డాయన్నమాట. వాటిని అనేక యితర వస్తువులతో కలిపి మన మనస్సులలో జతకూర్చు

కున్నామన్న మాట. ఉదాహరణకు "రంపంతో కలపను కోయవచ్చు" అని మనం అన్నపుడు, రంపం ఎలావుంటుందో, కలప ఎలావుంటుందో, కోయడం అంటే యేమిటో యిదివరకే మనకు తెలిసివుండాలి. ఇలా గుర్తుపట్టడం ఆలోచనల్లో మొట్టమొదటి దశ. అందుచేత "ఇది యేమిటి?"అని ఎవరైనా అడిగితే "ఇది ఫలానా వస్తువులా వుం"దని జవాబు చెబుతాం.

ఇక్కడ మనం ఒకసారి ఆగుదాం. పుస్తకం అంటే ఏమిటో ఎరగని ఒక వ్యక్తివచ్చి, "పుస్తకం అంటే ఏమిటండీ?" అని అడుగుతాడనుకుందాం. నేను నా చేతిలో వున్న పుస్తకాన్ని పై కెత్తి చూపి, "ఇదిగో చూడు, ఇలాగే వుంటుందీ" అని చెబుతాను. పుస్తకాలన్నీ ఎలా వుంటాయో చెప్పడానికి నావద్దవున్న ఆ పుస్తకం వుపయోగిస్తుంది. కాని, ఆవ్యక్తి వచ్చి దాన్ని పరిశీలిస్తే, అదొక ప్రత్యేకమైన పుస్తకమని స్పష్టమౌతుంది. ముఖ్యంగా అందులోవున్న విషయ సూచిక చూస్తే అలా కనిపిస్తుంది. అప్పుడు మనం ఏమంటాం? "నిజమే! ఈ పుస్తకం అనేక యితర పుస్తకాలలో ఒకటి. కాని ఏ పుస్తకానికీ లేని కొన్ని ప్రత్యేకతలు దీనికున్నాయి" అంటాం. ఇలాగే ఫ్యాక్టరీకార్మికులందరికీ కొన్ని సమానలక్షణాలు, కొన్ని ప్రత్యేకలక్షణాలు వుంటాయి. ఈ విధంగా ఒకే వస్తువులో సాధారణత్వం, విశిష్టత్వం కలిసివుంటాయి.

పై భావాన్నే యింకా లోతుగా పరిశీలిద్దాం. కొన్ని వస్తువుల్ని మనం తరగతులవారీగా విభజింపగలుతున్నామంటే, వాటన్నిటికి కొన్ని సమానలక్షణాలు, కొన్ని ప్రత్యేక లక్షణాలు వుండడంవల్లనే. కార్మికులందరు తమ శ్రమ శక్తిని పెట్టుబడిదారులకు అమ్ముకుని జీవిస్తారు. కాని అనేక యితర విషయాలలో వారిమధ్య తేడాలుంటాయి. ఉదాహరణకు: కూలీరేట్లవిషయంలో తేడాలుండవచ్చు. తెలివి తేటల్లోను, రాజకీయచైతన్యంలోనూ తేడాలుంటాయి.

అందుచేత కొన్ని విషయాల్లో కార్మికులమధ్య ఏకత్వం (Uniformity), మరికొన్ని విషయాల్లో నానాత్వం (Diversity) వుంటుంది.

పెట్టుబడిదారీ దేశాలన్నిటిలోను స్వంతలాభాల కోసం వస్తూత్పత్తిచేసే పెట్టుబడిదారీపద్ధతి అమల్లోవుంది. అయితే అన్ని

దేశాల్లోను పెట్టుబడిదారీ విధానం ఒకే స్థాయిలో లేదు. అమెరికాలో వున్నంత అభివృద్ధి ఇంగ్లండ్‌లో లేదు. హిట్లర్ పాలనకింద జర్మనీ ఫాసిస్టు దేశం; ఇంగ్లండ్, ఫ్రాన్సు, అమెరికా మొదలయినదేశాలు బూర్జువా ప్రజాతంత్ర దేశాలు. అందుచేత పెట్టుబడిదారీ దేశాలన్నింటికీ ఒక్కొక్క ప్రత్యేకత వుంటుంది. ఏకత్వం, నానాత్వం కలిసివుంటాయనడానికి యిది కూడ ఒక ఉదాహరణ. ఈ రెండు గుణాలు కలిసివున్నాయనే విషయం కొన్ని సందర్భాలలో ఎంతో ప్రాధాన్యత వహిస్తుంది. ఉదాహరణకు: ఒక పరిస్థితిలో రెండు పెట్టుబడిదారీదేశాలు విభిన్నమార్గాలు అవలంబించడానికి కారణం తెలుసుకోవడానికి యిది ఎంతో అవసరమవుతుంది. రెండవ ప్రపంచసంగ్రామంలో ఇంగ్లాండ్‌కు జర్మనీ శత్రుదేశంగా పరిణమించింది. ఇందుకు కారణం తెలుసుకోవాలంటే, రెండిటిమధ్య వైరుధ్యం ఎందుకు వచ్చిందో పరిశీలించాలి.

మనం ఏదైనా సమ్మెను నడిపేటప్పుడు కార్మికులందరినీ కూడగట్టవలసి వుంటుందిగనుక, వారందరినీ సమానంగా ఎదుర్కొనే సమస్యలకు ప్రాధాన్యత యిస్తాం. అనగా, ఏకత్వం ఎక్కువ ముఖ్యం. కాని ఒక భావవాదిని భౌతికవాదిగా మార్చేటందుకు మనం చేసే చర్చలో ఆ వ్యక్తియొక్క ప్రత్యేక లక్షణాలకు, అనగా నానాత్వానికి ప్రాధాన్యత యిస్తాం.

ప్రకృతిలో అనేకఘటనలు కొన్ని విధినియమాల ప్రకారం ఎప్పుడూ ఒకేవిధంగా జరగడం చూస్తున్నాం. ఏ విధి నియమాలప్రకారం అవి అలా జరుగుతున్నాయో తెలియజేసే ప్రకటనలకు ప్రకృతిశాస్త్ర నియమాలనిపేరు. ఉదాహరణకు బరువైన ఒక పదార్థాన్ని పైనుంచి కిందికి విడిచిపెడితే, దాని వేగం అంతకంతకు హెచ్చుతుందని సెకండుకు 32 అడుగుల చొప్పున ఆవేగం హెచ్చుతుందని శాస్త్రజ్ఞులు రుజువుచేశారు. ఆ వస్తువు ఎంత బరువుగా వున్నప్పటికీ, దేనితో అదిచేయబడినప్పటికీ, ఏ వూళ్లో దాన్ని పడవేసినప్పటికీ సెకండుకు 32 అడుగులచొప్పున దానివేగం హెచ్చుతుంది. దీని అర్థం ఏమిటి? అనేక భిన్నపరిస్థితుల్లో పైవిధంగా జరుగుతుందన్నమాట. పరిస్థితులు వేరైనా, ఫలితం మాత్రం ఒకటేనన్నమాట. దీనినే నానాత్వంలో ఏకత్వం అంటాం.

మరొక ఉదాహరణ తీసుకుందాం. ఒక సిలెండర్‌లో గ్యాసు (వాయుపదార్థం) వుందనుకుందాం. పిస్టన్‌తో మనం ఆ గ్యాసును

కుదించవచ్చు. ఆ ఒత్తిడి రెట్టింపువుంటే గ్యాసు యొక్క పరిమాణం సరిగా సగానికి తగ్గుతుంది. రెండురెట్లు ఒత్తిడితో కుదిస్తే, పరిమాణం నాల్గవవంతుకు తగ్గుతుంది. ఈ విధంగా ఒత్తిడి ఎంత ఎక్కువయితే, గ్యాసుయొక్క పరిమాణం సరిగా అంతకు తగ్గుతుంది.

ఏ వాయుపదార్థానికైనాసరే యీసూత్రం వర్తిస్తుంది.

అయితే, యిక్కడ మనం జ్ఞాపకముంచుకోవలసినదేమంటే, సర్వకాల సర్వావస్థలలోను యిలా జరుగదు. ఉదాహరణకు బరువైన ఒక వస్తువును భూమికి చాలాదూరంలో వున్న ఎత్తునుంచి పడవేస్తే, ఆ వస్తువును భూమి ఆకర్షించదు. అప్పుడు సెకండుకు 32 అడుగులచొప్పున దానివేగం హెచ్చడం కూడ జరగదు. అందుచేత కొన్ని పరిమితులలో మాత్రమే ప్రకృతినియమాలు అమలుజరుగుతాయి.

యాదృచ్ఛికత - క్రమపద్ధతి రెంటిమధ్య ఐక్యత, వైరుధ్యం (Accident and regularity - United and Contrasted) అనేక సందర్భాలలో మనకు కనిపిస్తుంది.

భీమా కంపెనీలకు సాధారణంగా లాభాలు యెలా వస్తాయో కొంచెం పరిశీలిద్దాం. ప్రతిఏడు 20 - 25 సం॥రాల మధ్య వయస్సుగలవారు, 25 - 30 సం॥రాల మధ్యవయస్సు గలవారు, 30-35 సం॥రాల మధ్య వయస్సుగలవారు యిలా కొన్ని సంవత్సరాల మధ్య వయస్సుగలవారంతా 1000లో ఎంతమంది చనిపోతున్నరో సంఖ్యావివరాలు తయారు చేస్తారు. ఇలా 20 లేక 30 సంవత్సరాలు, వరుసగా లెక్కలు తీసి, సగటున ప్రతిఏడు ఎంతెంతమంది చనిపోతారో తెలుసుకుంటారు. ఆ లెక్కల ఆధారంమీద ప్రీమియంరేట్లు నిర్ణయిస్తారు. ప్రతిఏడు ప్రీమియం మొత్తాలద్వారా లభించేసొమ్ము చనిపోయేవారి కుటుంబాలకు చెల్లించవలసిన సొమ్ముకంటే ఎక్కువగా వుండేటట్లుజాగ్రత్తపడతారు. ఒక్కొక్కసంవత్సరంలో ఏ ఏ పేరుగల పాలసీహోల్డరు చనిపోతాడో కంపెనీమేనేజరు చెప్పలేడు. కాని ప్రతిసంవత్సరం సగటున వెయ్యిమందిలో ఎంతమంది చనిపోతారోమాత్రం ఖచ్చితంగా చెప్పగలం. వారి కుటుంబాలకు చెల్లించేసొమ్ము ప్రీమియం మొత్తాలకంటె తక్కువగావుంటుంది. కనుక ఆ వ్యత్యాసం కంపెనీకి వచ్చే లాభమని చెప్పవచ్చు. అంటే భీమాకంపెనీ

దృష్టిలో ప్రతి మరణం ఒక యాదృచ్ఛికఘటన. ఇలాంటి యాదృచ్ఛికఘటనలు ప్రతి ఏడు కొన్ని జరుగుతూవుంటాయి. వాటన్నిటినీ కలిపి చూస్తే ఒక క్రమపద్ధతిప్రకారం అవి జరుగుతున్నట్లు తెలుసుకోవచ్చు.

యాదృచ్ఛికఘటనల పరిశీలనద్వారా భీమాకంపెనీలు తెలుసుకునే క్రమవిధానమే ఆ కంపెనీల కార్యకలాపాలకు మూలం అన్నమాట.

ట్రేడ్ యూనియన్‌ల విషయంకూడా యింతే. ప్రతి ట్రేడ్ యూనియన్‌లోను ఒక సంవత్సరంలో కొంతమంది కార్మికులు సభ్యులుగా చేరతారు. మరికొందరు తొలగిపోతారు. కాని ప్రతి ఏడు ఆ యూనియన్‌లో కొంతమందియైనా సభ్యులు వుండి తీరుతారు. ఇక్కడ మనం ఒక్కొక్క వ్యక్తిని, ఒక్కొక్క యాదృచ్ఛికఘటనగా భావించాలి. కొన్ని సందర్భాలలో ఉదాహరణకు సమ్మె - సభ్యుల మొత్తంసంఖ్య ప్రధానమవుతుంది. ఎంతమంది వ్యక్తులు సభ్యులుగా చేరారో, ఎంతమంది మానివేశారో అనేది అప్రధానమవుతుంది. కాని మరి కొన్ని సందర్భాలలో ఒక్కొక్క సభ్యుని సభ్యత్వపుకాలం ఎక్కువ ప్రాధాన్యత వహిస్తుంది. ఉదాహరణకు మొత్తం సభ్యత్వపు సంఖ్యలో మార్పులేకపోయినా, ఒక్కొక్కని సభ్యత్వపుకాలం పూర్వంకంటె తగ్గిపోవచ్చు; లేదా హెచ్చవచ్చు. అలాంటప్పుడు సభ్యుల స్థిరత్వాన్ని మనం సులభంగా తెలుసుకోగల్గుతాం. మార్పు మనకు స్పష్టంగా కనబడుతుంది.

అందుచేత ఒకే పరిస్థితిలో యీ రెండు లక్షణాలు - అనగా యాదృచ్ఛికత, క్రమపద్ధతి - ఒకదాని పక్క ఒకటి వుంటాయి. క్రియారంగంలో ఏది ఎక్కువ ప్రాధాన్యత వహిస్తుందీ అనే విషయం పరిస్థితుల్నిబట్టి వుంటుంది.

రాజకీయపార్టీల పెంపుదలను పరిశీలించేటప్పుడుకూడా మనం దీన్ని గుర్తిస్తాం. ప్రతి రాజకీయపార్టీలోకి కొందరు వస్తూంటారు; మరికొందరు పోతూంటారు. ఆ పార్టీయొక్క సంఖ్యాబలాన్ని మాత్రమే మనం పరిశీలించ దలుచుకుంటే, మొత్తం సభ్యత్వం పెరుగుతోందా, లేక తగ్గుతోందా - అని చూస్తేచాలు. కాని ఆ పార్టీసభ్యుల స్థిరత్వాన్ని పరిశీలించాలనుకున్నా, లేక దాని వర్గస్వభావాన్ని చూడాలనుకొన్నా, ఒక్కొక్క సభ్యుడు ఎంతెంతకాలం ఆ పార్టీలో వున్నాడో లెక్కలు తీయాలి.

లేదా ఒక్కొక్క సభ్యుడు ఏ వర్గంనుంచి వచ్చాడో వివరాలు సంపాదించాలి. అప్పుడు ఆ పార్టీయొక్క స్థిరత్వాన్ని, లేదా వర్గస్వభావాన్ని తెలుసుకోగల్గుతాం.

వీటన్నిటివల్ల మనకు బోధపడేదేమంటే "ఇది ఏమిటి?" అనే ప్రశ్నకు జవాబు చెప్పేటప్పుడు అనేక విషయాలు మనం దృష్టిలో వుంచుకోవాలి. ఆ వస్తువు ఏ తరగతికి చెందినదో, దాని సాధారణ లక్షణాలు – ప్రత్యేక లక్షణాలు ఏమిటో తెలుసుకోవాలి. అదొక యాదృచ్ఛిక ఘటనా, లేక క్రమబద్ధంగా అనేక యాదృచ్ఛిక ఘటనలలో ఒకభాగమా? ప్రకృతి నియమాల మాదిరిగా విభిన్న పరిస్థితులలో ఒకేవిధంగా అది ప్రవర్తించేదా, లేక! పరిస్థితినిబట్టి ప్రవర్తిస్తుందా? అని ప్రశ్నించుకోవాలి. ఈ విధంగా మనం ఆ వస్తువులోని వైరుధ్యాలను జాగ్రత్తగా పరిశీలించాలి.



# ఆరవ అధ్యాయం

## యాంత్రిక భౌతికవాదం

కొందరు తమ సంభాషణల్లో "మానవస్వభావం ఎన్నడూ మారదు" అనడం వింటుంటాం. "స్త్రీలు స్త్రీలే", "పిల్లలు పిల్లలే" అనడంకూడా మన మెరుగుదుం. పైమాటల్లో మార్పును గురించి ఒక వ్యక్తికిగల అభిప్రాయం విదితమవుతుంది. అందుచేత ఒకవ్యక్తి భావవాదియా, భౌతికవాదియా - అనే విషయం నిర్ధారణ అయినంత మాత్రాన సరిపోదు. ఆవ్యక్తి ప్రపంచం మారుతోందనుకుంటున్నాడా, లేక స్థిరంగా యిలాగే వుంటుందనుకొంటున్నాడా - అనే విషయంకూడా నిర్ధారణ కావాలి.

మానవ స్వభావాన్నిగురించి పై వ్యక్తి వెలిబుచ్చిన దృక్పథాన్నే కొందరు సమాజానికికూడా వర్తింపజేస్తారు. "నేటి ఆర్థికవిధానం మార్పుచెందదు" అనీ, "ఈసామాజిక వ్యవస్థ ఎల్లప్పుడూ యిలాగేవుంటుంది" అనీ వారు అంటారు. కాని, యిది వాస్తవ పరిస్థితులకు వ్యతిరేకం. ప్రపంచం నిత్యమూ మార్పుచెందడం మనకు కనిపిస్తోంది. భూమిపై నివసించే జీవరాసులన్నీ అనేక పరిణామదశలద్వారా ఎలా మారుతూ వచ్చాయో డార్విన్ రుజువుచేశాడు. అదేవిధంగా యిప్పుడున్న పెట్టుబడిదారీవిధానం ప్రపంచం పుట్టినప్పటినుంచీ లేదు. మొదట ఆదిమకమ్యూనిజం. తర్వాత బానిసపద్ధతి, ఆ తర్వాత ఫ్యూడలిజం, యిప్పుడు పెట్టుబడిదారీవిధానం వచ్చాయి. సోవియట్ రష్యాలో పెట్టుబడిదారీవిధానంకూడా నశించి, సోషలిజం వచ్చింది.

సామాజికవ్యవస్థలతోబాటు మన స్వభావం, నీతి నియమాలు, సంఘ కట్టుబాట్లుకూడా మారుతూవచ్చాయి. ఉదాహరణకు: దురాశ, అధికార వ్యామోహం మానవ స్వభావమని కొందరు వాదిస్తారు. కాని సోషలిస్టువ్యవస్థలో యివి దుర్గుణాలుగా పరిగణించబడుతున్నాయి.

"స్త్రీలు స్త్రీలే" అన్నమాటలో ఎల్లప్పుడూ స్త్రీలు అబలలుగా వుంటారనే అర్థం యిమిడివుంది. కాని స్త్రీలకు తగు అవకాశాలు కల్పిస్తే పురుషులతో సమానమయిన బాధ్యతలను నెరవేరుస్తారని రష్యా అనుభవంవల్ల స్పష్టమవుతుంది. అలాగే, పిల్లలకు సరియైన విద్యాబుద్ధులు గరపితే మంచి తెలివితేటలుగల పౌరులుగా తయారవుతారు.

నిజం చెప్పవలసివస్తే, ప్రపంచం మారదనేవారందరూ ప్రస్తుత పరిస్థితుల్ని యిలాగే వుంచాలని కోరేవారు. అభివృద్ధిని వ్యతిరేకించేవారు. ఈవిషయం "వ్యాపారం వ్యాపారమే" అనుమాటల్లో మరీ స్పష్టంగా కనబడుతుంది. ఇలా అనేవారు వ్యాపారంలో అనేక మోసాలు వున్నాయని ఒప్పుకుంటారు. కాని అవి తప్పవంటారు. అనగా మోసాన్ని ప్రత్యక్షంగా సమర్థిస్తున్నారన్నమాట. యుద్ధోన్మాదులుకూడా యీ తరగతికి చెందినవారే. వీరు ప్రపంచం పుట్టినప్పటినుంచీ యుద్ధాలు వున్నాయంటారు. అందుచేత ముందుకూడా యుద్ధాలు తప్పవంటారు.

ఇట్టి అభివృద్ధినిరోధకుల ప్రయోజనాల కనుగుణ్యంగా తత్త్వవేత్తలు రకరకాల సిద్ధాంతాలు ప్రచారంచేశారు; చేస్తున్నారు. వారి అభిప్రాయంప్రకారం, మారేవన్నీ వాస్తవాలు కావు. మారకుండా వుండేవే వాస్తవాలు.

పదార్థానికి మూడు సహజలక్షణాలుంటాయి: మొదటిది స్థలం; రెండవది కాలం; మూడవది మార్పు. ఈ మూడు లక్షణాలూ లేని వస్తువంటూ ప్రపంచంలో లేదు. ఉదాహరణకు, ఒక యిల్లు ఫలానాచోట ఫలానాకాలంలోనే వుంటుంది; అది క్రమేణా శిథిలమవుతూవుంటుంది.

వస్తువుల మార్పుకు కారణ మేమిటో తెలుసుకోడానికి భౌతికవాదులు మొదటినుంచీ పరిశోధనలు చేశారు.

క్రీస్తుపూర్వం 5,6 శతాబ్దాలలో థేల్స్, ఒనాక్సమినిస్, హెరాక్లిటస్ అను గ్రీకు తత్వశాస్త్రజ్ఞులు భౌతికవాదదృష్టితో మార్పునుగురించి పరిశోధనలుచేశారు. ప్రతివస్తువు కొన్ని మూలపదార్థాల (నీరు, అగ్ని, వాయువు మొదలైనవి) పరమాణువులతో ఏర్పడుతోందని, వాటి నిర్మాణంలో కలిగే మార్పులే ఆ వస్తువుల రూపం మారడానిక్కూడా కారణమనీ వారు సిద్ధాంతీకరించారు. పరస్పర విరుద్ధమైన శక్తులమధ్య జరిగే సంఘర్షణే మార్పుకు కారణమని హెరాక్లిటస్ వాదించాడు.

అయితే, అతడు తన వాదనను రుజువుచేసుకోగల శాస్త్రపరిజ్ఞానం ఆనాటికి లేదు. కనుకనే వీరంతా "స్వాభావిక భౌతికవాదులు." మన దేశంలో చార్వాకులుకూడా యీ తరగతికే చెందుతారు.

తర్వాత డెమాక్రిటస్ అను మరొక గ్రీక్ తత్వవేత్త ప్రతివస్తువులో వుండే పరమాణువులు కఠినమైనవీ, మెత్తనివీ అని రెండు రకాలుగా విభజించాడు. వాటిని విచ్ఛిన్నం చేయడం అసాధ్యమన్నాడు. ఆత్మ మెత్తని పరమాణువుల సమ్మేళనమన్నాడు. క్రీ.పూ. 250 ప్రాంతంలో భారతీయ తత్త్వవేత్త కణాదుడు అణు సిద్ధాంతాన్ని ప్రచారంచేశాడు. ప్రపంచానికి మూలం అణువులనీ, అణువుల సంయోగఫలితంగానే ప్రకృతి, మానవుడు, ప్రపంచం ఏర్పడుతున్నాయనీ యితని వాదన. ఒక్కొక్క అణువులో ఒక్కొక్క అంశ వున్నదనీ, కనుకనే వస్తువులకు వేర్వేరుగుణాలు ఏర్పడుతున్నాయనీ కణాదుడు ప్రతిపాదించాడు. అందుచేతనే యితని సిద్ధాంతం 'వైశేషిక సిద్ధాంతం' అని పిలువబడుతోంది. అయితే కణాదుడు పూర్తి భౌతికవాదికాడు. అణువులలోని విశేషాంశ భగవత్స్వరూపమని యితని నమ్మకం.

క్రీస్తుపూర్వం 3వ శతాబ్దంలో ఎపిక్యురస్, 1వ శతాబ్దంలో లుక్రీషియస్ అను గ్రీక్ భౌతికవాదులు మానవాభ్యుదయంకొరకు ప్రపంచాన్ని మార్చవచ్చుననీ, అలా మార్చడమే మానవుని పరమావధి అనీ ప్రచారంచేశారు. ఆనాడు ప్రజల్లో వ్యాపించియున్న మూఢనమ్మకాలను వారు నిశితంగా ఖండించారు.

15, 16 శతాబ్దాలలో బ్రిటిష్ భౌతికవాదులు పదార్థంనుంచి భావం పుట్టిందేగాని, భావంనుంచి పదార్థం పుట్టలేదని వాదించారు. వీరిలో బేకన్ ముఖ్యుడు. కానీ అతడు తన వాదనను సహేతుకంగా రుజువుచేయలేకపోయాడు. లాక్‌మాత్రం జీవితానుభవంనుంచి మానవుడు నేర్చుకునే పాఠాలద్వారా దీన్ని రుజువుచేయగలిగాడు. ఇందు కతడు ఒక టేబుల్‌ని ఉదాహరణగా తీసుకున్నాడు. ప్రపంచంలో మొట్టమొదటి టేబుల్ తయారుకాకపూర్వం మానవుడు ఒక చెట్టు మొద్దును టేబుల్‌గా వుపయోగించుకొనేవాడనీ, అలా వుపయోగించుకోవడంలో కలిగిన అనుభవాన్ని ఆధారంగా చేసుకొని మొట్టమొదటి టేబుల్‌ను కనిపెట్టాడనీ లాక్ వివరించాడు.

17వ శతాబ్దంలో పాశ్చాత్యశాస్త్రజ్ఞులు భౌతిక ప్రపంచాన్నిగురించి అనేక కొత్తవిషయాలు కనుగొన్నారు. సముద్రంమీద దీర్ఘకాల ప్రయాణాల కవసరమైన ఖగోళశాస్త్రం, ఖనిజసంపత్తిని పెద్దయెత్తున పైకితీయడాని కవసరమైన భూగర్భశాస్త్రం, యుద్ధాలలో విజయసాధన కవసరమైన ఆధునిక ఆయుధోత్పత్తి మొదలైనవన్నీ యీ కాలంలోనే ఎక్కువగా అభివృద్ధిచెందాయి. పదార్థవిజ్ఞానశాస్త్రం, రసాయనికశాస్త్రం మొదలైనవికూడా యీ కాలంలోనే అభివృద్ధి చెందాయి. న్యూటన్, బాయిల్ మొదలైన ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రజ్ఞుల కృషిఫలితంగా భూమికీ - సూర్యునికీగల సంబంధం భూమియొక్క ఆకర్షణశక్తి, ఖగోళాలమధ్య సంబంధం, వాయుపదార్థాలపై ఒత్తిడియొక్క ప్రభావం - వీటన్నిటినిగురించి కొత్తసిద్ధాంతాలనేకం కనిపెట్టబడ్డాయి.

అయితే వారు వీటన్నిటి వెనుక మార్పుచెందని కొన్ని శాశ్వత సంబంధా లున్నాయన్నారు. అనగా వారి దృష్టిలో నిరంతరం మారే యీ ప్రపంచం మారని కొన్ని పరిమితుల్లో వుందన్నమాట! మానవాతీతమైన కొన్ని శక్తుల ప్రభావంవల్ల ప్రపంచమంతా తిరుగుతోందని వీరి అభిప్రాయం. దీని అర్థం ప్రపంచంలో అన్ని ఘటనలు వాటి సంబంధాలనుబట్టి కాకుండా, మానవాతీతమైన కొన్ని శక్తుల్నిబట్టి జరుగుతున్నాయన్నమాట! క్రియలో వీరుకూడ మార్పుకు వ్యతిరేకులేనను విషయం స్పష్టం.

18వ శతాబ్దంలో హోల్‌బాక్, హెల్వీషియస్, డిడిరో మొదలైన ఫ్రెంచి భౌతికవాదులు ప్రపంచాన్నిగురించీ, మార్పునుగురించీ మరికొన్ని కొత్త సిద్ధాంతాలను ప్రచారంచేశారు. ఆనాటి ఫ్రెంచి ప్రజల్ని ఫ్యూడల్ రాచరికాన్ని వ్యతిరేకంగా విప్లవసన్నద్ధుల్ని చేసేటందు కవి చాలా సహాయపడ్డాయి. భౌతికప్రపంచాని కతీతమయినశక్తి ఏదీ లేదనీ, మానవుడు ఇహలోకంలో అభివృద్ధిచెందడానికి అంతులేని అవకాశా లున్నాయనీ వారి వాదన. అయితే, కొన్ని కృత్రిమ సామాజికసంస్థలు మానవాభివృద్ధిని అరికడుతున్నాయని వారి సిద్ధాంతం. అందుచేత వారు మతంమీద, ఆనాటి ఫ్యూడల్ సామాజికవ్యవస్థమీద, రాజ్యాంగ విధానంమీద తిరుగుబాటుచేశారు. ప్రతి సమస్యను వారు హేతువాదంతో పరీక్షించేవారు. హేతువాదానికి నిలబడని వ్యవస్థ, సిద్ధాంతాలు, విశ్వాసాలు కూలిపోక తప్పవన్నారు.

ఆనాటి ఫ్రాన్స్‌దేశపు పరిస్థితుల్లో వీరి సిద్ధాంతాలు గొప్ప విప్లవ పాత్ర వహించాయి. లూయీచక్రవర్తి పరిపాలనలో భూస్వామ్యదోపిడీ అతి వికృతమైనరూపం ధరించింది. మతాధిపతులు లక్షలాది యకరాల భూమిని తమ గుప్పెట్లో ఉంచుకుని రైతుల రక్తమాంసాలను తెగపీల్చేవారు. రాజ్యాంగ యంత్రంలో వారి పలుకుబడి అమితం. అలాంటి పరిస్థితుల్లో ఫ్రెంచి భౌతికవాదులు రాచరిక ప్రభుత్వంమీద, ఫ్యూడల్‌వ్యవస్థమీద, మతంమీద బలమైన సమ్మెటదెబ్బలు కొట్టారు. వారి దృష్టిలో మానవుడు బాహ్యపరిస్థితుల కనుగుణ్యంగా మార్పుచెందుతాడు. అందుచేత ప్రజలు సుఖ సంపదలతో జీవించాలన్నా, మానసికంగా అభివృద్ధి చెందాలన్నా భౌతికపరిస్థితుల్లో మార్పుతీసుకురావాలి. మతం మానవుణ్ణి మూఢునిగా తయారుచేయడంచేత దాన్ని హేతువాదంతో నిర్మూలించాలి. వీరి సిద్ధాంతాలు "స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరత్వం" అనే నినాదాలతో విశిష్టరూపం పొందాయి.

కాని ఫ్రెంచి భౌతికవాదులు మార్పుయొక్క స్వభావాన్ని సమగ్రంగా పరిశీలించలేకపోయారు. ప్రపంచంలో జరిగే మార్పులు యంత్రగమనాన్ని పోలి యుంటాయని వారి అభిప్రాయం. పదార్థంయొక్క వివిధరూపాలు అన్ని పరిస్థితుల్లోను ఒకేవిధంగా మెలగుతాయని న్యూటన్ మొదలైన పరిశోధకులు స్పష్టం చేశారు. వారు కనుగొన్న సిద్ధాంతాలు నిజమని రుజువుచేయడానికి అనేకమంది అనేక పరిశోధనలు చేశారు. ఆ ప్రయోగాల ఆధారంపై యంత్రాలు కనిపెట్ట బడ్డాయి. కొన్ని ప్రత్యేకలక్షణాలు గల్గిన వస్తువులను ఒక క్రమపద్ధతిలో సమకూర్చి నట్లయితే యంత్రం తయారవుతుంది. దాని చక్రాలు ఆవిరిశక్తి సహాయంతోనో, మరొకశక్తి సహాయంతోనో ఒకేవిధంగా తిరుగుతాయి. చక్రం ఒక చుట్టుతిరగడం చూచాక మరుక్షణంలోకూడా అలాగే తిరుగుతుంది. ఇట్టి యంత్రం ఫ్రెంచి భౌతికవాదుల సిద్ధాంతాలకు రూపాంతరం. వారి దృష్టిలో ప్రపంచ ఘటనలన్నీ చక్రం తిరిగినట్లు ఒకేవిధంగా తిరుగుతాయి. దాన్ని కనిపెట్టిన యింజనీరు విషయంగాని, దాన్ని తయారుచేసిన టెక్నీషియన్ల విషయంగాని వారి దృష్టిపథానికి రాలేదు.

ఇందుకు కారణంకూడా లేకపోలేదు. ఆరోజుల్లో యంత్రశక్తివల్ల మానవు డెన్నెన్ని సౌఖ్యా లనుభవించవచ్చునో అందరూ చూచారు.

దానిప్రభావం ఫ్రెంచి భౌతికవాదులమీదకూడా పడింది. ఇందులో ఆశ్చర్యపడవలసింది కూడా లేదు. కనుకనే ఫ్రెంచి భౌతికవాదులు "యాంత్రిక భౌతికవాదు"లని పిలువబడుతున్నారు. "మానవునిలో భావాలెలా యేర్పడుతున్నాయి?" అనే ప్రశ్నకు వారు "మెదడులో ఏర్పడుతున్నాయి" అని చెప్పి వూరుకున్నారు. కాని అలాంటి భావాలే మెదడులో ఎందుకు ఉత్పన్నమవాలి? ఇతర విధాలైన భావాలెందుకేర్పడవు? అనే ప్రశ్నలకు వారు సమాధానం చెప్పలేకపోయారు. సామాజికపరిస్థితులవల్లనే మానవునిలో భావాలేర్పడుతున్నాయనేవిషయం వారు విస్మరించారు.

రెండవది, వారికి చారిత్రకదృష్టి లేదు. ఒకవైపు వారు ప్రపంచ మెల్లప్పుడూ మార్పుచెందుతుందని అంగీకరిస్తూనే ప్రస్తుత మార్పుకు మూలం అంతకు ముందున్న పరిస్థితేనని గుర్తించరు. మార్పును పరిశీలించేటప్పుడు భూత, వర్తమాన, భవిష్యత్కాలాలను దృష్టిలోవుంచుకోవాలి. కాని వీరలా చేయలేదు. స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరత్వం అనేభావాలు శాశ్వతసత్యాలుగా వీరు పరిగణించారు. వాటి వెనుకనున్న చారిత్రక పరిస్థితుల్ని గమనించలేదు. అలాగే మతాన్నీ, ఫ్యూడల్ సంబంధాలనూ పరిశీలించేటప్పుడు వారు చారిత్రక పరిస్థితుల్ని దృష్టిలో వుంచుకోలేదు. ఉదాహరణకు ఆదిమ కమ్యూనిజంలో మతమే లేదు. బానిసవిధానం అమల్లోకి వచ్చినప్పటినుంచి అది వివిధరూపాల్లో దోపిడీవర్గాలకు తోడ్పడుతూవచ్చింది. ఎప్పుడైతే దోపిడివర్గాలు నిర్మూలింపబడి వర్గరహితమైన కమ్యూనిస్టు సమాజం ఏర్పడుతుందో, అప్పుడు మతంయొక్క అవసరంకూడా పోతుంది. ఇలాగే ఫ్యూడల్ సంబంధాల విషయంకూడా. బానిసయుగంలో ఉత్పత్తి సంబంధాలు కాలానుగుణ్యంగా మార్పు చెందకపోవడంవల్ల, అంతర్యుద్ధాలవల్ల, బానిసల తిరుగుబాట్లవల్ల బానిస సమాజం విచ్ఛిన్నమయేపరిస్థితి ఏర్పడింది. అందుచేత ఫ్యూడల్వ్యవస్థ అనివార్యంగా ఏర్పడింది.

మూడవది, ప్రపంచాన్ని మార్పుచేయడంలో మానవుని పాత్రకువారు తగినంత ప్రాధాన్యత యివ్వలేదు. మానవుడు పరిసరాలనుబట్టి మార్పుచెందుతున్నాడని చెప్పారేగాని, ఆ పరిసరాలను మానవుడు మార్చగలడని వారు గ్రహించలేదు. భావాలకు మూలం

పదార్థమని రుజువుచేయడంలో ఫ్రెంచి భౌతిక వాదులు చరిత్రాత్మకమైన పాత్ర నిర్వహించినమాట వాస్తవం. కాని పదార్థాన్ని మార్చడంలో భావాలయొక్క ప్రభావాన్ని గుర్తించకపోవడం వారి బలహీనత.

పై లోపాలకు కారణం తెలుసుకోవాలంటే, ఆనాటి భౌతిక పరిస్థితుల్ని మనం దృష్టిలో వుంచుకోవాలి. ఆ రోజుల్లో మిగతా శాస్త్రాలకంటె మెకానిక్స్ (యంత్రగమన శాస్త్రం) ఎక్కువ ప్రాధాన్యత వహించేది. గణితశాస్త్రం, పదార్థ విజ్ఞానశాస్త్రం, రసాయనికశాస్త్రం, జీవశాస్త్రం మొదలైనవన్నీ ఒకదానితో ఒకటి సంబంధంలేనట్టు వేర్వేరుగా పరిశోధనలు చేసేవారు. ఒక డాక్టరు జీర్ణకోశాన్ని పరిశీలించేటప్పుడు రసాయనికశాస్త్రంతో అతనికి పరిచయం లేకపోతే, వాస్తవాన్ని తెలుసుకోవడం ఎంత కష్టమో మనం ఊహించుకోవచ్చు. ఇదేవిధంగా వేడిమి, వెలుతురు అనే రెండు శక్తులను పరిశీలించేటప్పుడు పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞులు వేర్వేరుగా వాటిపై పరిశోధనలు చేసేవారు. వాటి మధ్య అన్యోన్య సంబంధంవున్నదనేవిషయాన్ని వారు అప్పటికి గుర్తించలేదు.

అదీగాక, "యాంత్రిక భౌతికవాదులు" అనేక శతాబ్దాల నుంచి సాంప్రదాయసిద్ధంగా తత్త్వశాస్త్రజ్ఞు లవలంబించే మెటఫిజికల్‌పద్ధతితో ప్రతి విషయాన్నీ పరిశీలిస్తూవచ్చారు. మార్పునుగురించి సమగ్రమైనదృక్పథం వీరిలో లేకపోవడానికి ప్రధాన కారణం యిదే.

ఈ మెటఫిజికల్ పద్ధతి ఎలాంటిదో పరిశీలిద్దాం.

దీనికి ప్రాతిపదిక నాలుగు సూత్రాలు. మొదటిది సారూప్య సిద్ధాంతం (Principle of identity). సాధారణంగా ప్రజల్లో అధిక సంఖ్యాకులు ఏ వస్తువునైనా, లేక ఏ ఘటననైనా పరిశీలించేటప్పుడు, చలనంకంటె, చలన రాహిత్యమే దాని సహజలక్షణంగా కనిపిస్తుంది. ఏ వస్తువుకైనా చలనానికి ముందు. చలనరాహిత్యం వుండి తీరుతుందని భావిస్తారు. ఈ సందర్భంలో చలనం (Motion), మార్పు (Change) అనే మాటల అర్థాన్ని మనం గమనించవలసి యుంటుంది. చలనం అనే మాటకు అర్థం ఒకచోటనుంచి మరోచోటికి వెళ్ళటం; మార్పు అంటే ఒక రూపంనుంచి మరోరూపంలోకి మారడం. ఉదాహరణకు ఆకులు రాలిపోయినచెట్టు తన మొదటిరూపాన్ని విడిచిపెట్టి, రెండవ రూపాన్ని

ధరిస్తుంది. మెటఫిజికల్ పద్ధతి ననుసరించేవారు ప్రపంచాన్నీ, ప్రపంచ ఘటనలనూ పరిశీలించేటప్పుడు చలనానికి బదులు చలనరాహిత్యానికీ, మార్పుకు బదులు స్థిరత్వానికీ ఎక్కువ ప్రాధాన్యత యిస్తారు. ఇదే సారూప్యసిద్ధాంతం. ఈ సిద్ధాంతం ప్రకారం ప్రకృతి, మానవుడు, సమాజం ఎల్లప్పుడూ ఒకేవిధంగా మార్పు చెందుతాయి. "ప్రపంచంలో కొత్తవిషయమేమీ లేదు" అనే మాటల్లోని అర్థం యిదే. ప్రపంచం పుట్టినప్పటినుంచీ అందులో మార్పులేదనీ, వున్నా ఒకేవిధమైన మార్పు జరుగుతోందనీ వారి అభిప్రాయం. "మానవుడు మొదటినుంచీ యిలాగేవున్నాడు" అనే మాటల్లోని అర్థంకూడా యిదే.

ఈ సిద్ధాంతం ప్రకారం, పది సంవత్సరాలనాడు నిర్మింపబడిన ఒక యిల్లు నాలుగు తలుపులతోను, పది కిటికీలతోను, కొన్ని గోడలతోను యిప్పటికీ అదే విధంగా నిలిచివున్నదంటే దానికి కారణం ఆ యిల్లు యిల్లుగానే వుండడంవల్ల; దానిలో ఎట్టిమార్పు లేకపోవడంవల్ల; మరోరూపం ధరించకపోవటం వల్ల. ఒక వస్తువు ఆ వస్తువువేగాని, మరోవస్తువు కాజాలదని చెప్పడమే సారూప్యసిద్ధాంతం.

దీన్ని మనం అంగీకరించే పక్షంలో జీవించడం వేరు, మరణించడం వేరు అని ఒప్పుకోవలసియుంటుంది. పైకి యిదెంతో సహజ విషయంగానే కనబడవచ్చు. ఈ వాదన వాస్తవ పరిస్థితుల కెంత విరుద్ధమో తర్వాత వివరింపబడుతుంది. ఈ సిద్ధాంతాన్ని సమ్మేవారు దేశకాలపరిస్థితుల్ని దృష్టిలోవుంచుకోకుండా , ఏదుక్కి బియ్యానికీ ఒకేమంత్రం వల్లిస్తారు. "హిట్లరు జర్మనీలోనూ నియంతృత్వంవుంది; సోవియటు రష్యాలోనూ నియంతృత్వం వుంది; నియంతృత్వం నియంతృత్వమే" అనే వాదన ఎంత అపసవ్యమైనదో మనకు తెలుసు. హిట్లరు జర్మనీలో దోపిడివర్గాల నియంతృత్వంవుంటే, రష్యాలో వున్నది శ్రామిక నియంతృత్వం. మొదటిది ప్రజాసామాన్యాన్ని దోచుకొనే నియంతృత్వం; రెండవది ప్రజాసామాన్యానికి రక్షణయిచ్చే నియంతృత్వం.

రెండవది భిన్నత్వ సిద్ధాంతం (Isolation of things) అన్ని వస్తువుల్నీ, లేదా అన్ని ఘటనల్నీ ఒకదాంతో ఒకటి సంబంధంలేకుండా విడివిడిగా చూడ్డమే భిన్నత్వ సిద్ధాంతం. ఉదాహరణకు మనం కొన్ని జంతువుల్ని పరిశీలించేటప్పుడు విభిన్నజాతుల జంతువులకు సమాన లక్షణాలేవైనా వున్నాయోలేవో చూడం. గుర్రాన్నీ, ఎద్దునూ, కుక్కనూ

వేర్వేరు జాతులుగా చూస్తాం. పూర్వం జంతుశాస్త్రజ్ఞు లీ దృక్పథంతోనే పరిశోధనలు జరిపేవారు. పెట్టుబడిదారీవర్గం సైన్సును సైన్సుగానూ, తత్త్వశాస్త్రాన్ని తత్త్వశాస్త్రంగానూ, రాజకీయాలను రాజకీయాలుగానూ ప్రత్యేకించి చూడాలంటారు. శాస్త్రపరిశోధకులు రాజకీయాలతో సంబంధంపెట్టుకోరాదనీ, తత్త్వశాస్త్రం జోలికి పోరాదనీ వీరి అభిప్రాయం.

మార్క్సిస్టులు కానివారు సాధారణంగా రాజ్యాంగ యంత్రాన్ని పరిశీలించేటప్పుడు సామాజికవ్యవస్థనుంచి దాన్ని విడదీసి చూస్తారు. అప్పుడు అమెరికాలోని రాజ్యాంగ యంత్రమూ, సోవియట్ రష్యాలోని రాజ్యాంగయంత్రమూ, చైనాలోని రాజ్యాంగయంత్రమూ ఒకటిగానే కనిపిస్తాయి. "ఏ దేశంలోనైనా రాజ్యాంగయంత్రం రాజ్యాంగయంత్రమే" అనే నిర్ధారణకు వారు వస్తారు.

మూడవది: వ్యత్యాసాలు శాశ్వతం, అనివార్యం అనే సిద్ధాంతం (Eternal insurmountable diferences) ప్రపంచంలో అన్ని వస్తువులూ యితర వస్తువులతో ఎల్లప్పుడూ భేదిస్తాయనీ, యిది అనివార్యమనీ యీ సిద్ధాంతం చెబుతుంది. ఉదాహరణకు: మానవ సమాజంలో రెండువర్గాలున్నాయని మనం అన్నప్పుడు పెట్టుబడిదారీసిద్ధాంతవేత్తలు మొదటినుంచీ ధనికులు - పేదలు వుంటూనేవచ్చారనీ, యికముందు కూడా వుంటారనీ వాదించడం మనం చూస్తున్నాం. పెట్టుబడిదారీవర్గం, శ్రామికవర్గం అనే రెండు వర్గాలను కాకుండా, ధనికులు-పేదలు అనే రెండు తరగతుల ప్రజల్ని వారు మన యెదుట పెడతారు. ఒకవేళ వారు యీ రెండువర్గాలూ వున్నాయని అంగీకరించినప్పటికీ, రెండింటి మధ్యగల సంబంధాన్ని మాత్రం వారు గుర్తించరు; వర్గపోరాటంలో ఆ వర్గాలపాత్ర యేమిటో గమనించరు.

నాల్గవ సిద్ధాంతం: పరస్పర వైరుధ్యాలమధ్య భేద భావం (opposition of contraries). ఇది పై మూడు సిద్ధాంతాల పర్యవసానమని చెప్పవచ్చును. "జీవించడం వేరు, మరణించడం వేరు" అని అన్నప్పుడు ఆ రెండింటికీ సంబంధంలేనట్లు మనం చూస్తాం. మనం యీ పద్ధతి ననుసరిస్తే, అప్పటికప్పుడు ప్రాణంపోయిన ఒకవ్యక్తి మరణించినట్లే భావిస్తాం. ఇందుకు కారణం జీవించడం, మరణించడం వేర్వేరు ఘటనలుగా పరిగణించడం.

ఈవిధంగా వస్తువుల్నీ, ఘటనల్నీ వేర్వేరుగా చూడ్డంవల్ల ఒకదానికీ, మరోదానికీ వైరుధ్యంవున్నట్లు మనకు కనబడుతుంది. రెండు పరస్పర వ్యతిరేక వస్తువులు, లేదా ఘటనలు ఏక కాలంలో కలిసివుండడం అసంభవంగా తోస్తుంది. అందుచేత పై ఉదాహరణలో జీవించడం, మరణించడం తప్పితే మూడవగుణం లేనట్లే కనిపిస్తుంది. మన వర్గీకరణ పద్ధతిలో జీవించే వ్యక్తులైనా వుంటారు; మరణించిన వ్యక్తులైనా వుంటారు. మూడవరకపువారుండడం అసంభవమనే అనుకుంటాం.

పై నాలుగు సూత్రాలతోకూడిన మెటఫిజికల్ పద్ధతి ప్రకృతిలో జరిగే మార్పుల్ని యెలా పరిశీలిస్తుందో చూద్దాం. ప్రకృతిలో అన్ని వస్తువులూ యంత్రంలో భాగాలు తిరుగుతున్నట్లు మార్పుచెందుతాయని చాలమంది అభిప్రాయం. 17, 18 శతాబ్దాల "యాంత్రిక" భౌతికవాదులు యీ తరగతికి చెందినవారే. వీరు సూర్యమండలంయొక్క గమన సూత్రాలన్నిటినీ (భూమి సూర్యునిచుట్టూ తిరగడంవగైరా) అంగీకరిస్తారు. కాని యీ గమనం యాంత్రికమైనదని భావిస్తారు. అంటే అన్ని గోళాలూ వాటి వాటి స్థలాలనుమాత్రం వీడి తిరుగుతూవుంటాయనీ, స్థలమార్పు తప్ప మరోమార్పు వుండదనీ వీరి అభిప్రాయం. భూమి సూర్యునిచుట్టూ నిరంతరం తిరుగుతూవుంటుందని వీరు రుజువుచేయగలరు. అయితే, అలా తిరిగడంలో భూమిలోనే కొన్నిమార్పులు జరుగుతాయనే విషయం (భూమి చల్లబడ్డం వగైరా) గుర్తించరు. వీరి దృష్టిలో ఎల్లప్పుడూ భూమి భూమిగానే వుంటుంది. మనం పుట్టినప్పుడది ఎలా తిరుగుతూవుండేదో, చనిపోయినతర్వాత కూడా అలాగే తిరుగుతూవుంటుంది; ఎన్ని లక్షల సంవత్సరాలు గడిచినా, కొత్త పరిణామాలేవీ జరగవు - ఇదీ "యాంత్రిక" భౌతికవాదుల దృక్పథం. అతి నైపుణ్యంతో తయారుచేయబడిన ఒక చేతిగడియారం నిరంతరం ఎట్టి మార్పూ లేకుండా తిరుగుతూవుంటుంది. రోజూ 'కీ' యివ్వనవసరం లేకుండా తిరిగే గడియారాలుకూడా వున్నాయి. ఇలాంటి దృక్పథమే "యాంత్రిక" భౌతికవాదులది. ప్రకృతిని వారొక గడియారంమాదిరిగా చూస్తారు. ఇదే నిజమైతే అన్ని వస్తువులూ, అన్ని ఘటనలూ మార్పుచెందుతున్నప్పటికీ అవి ఎల్లప్పుడూ ఒకే చోటుకు

చేరుకుంటూవుంటాయనీ, వాటి రూపం ఎన్నడూ మార్పుచెందదనీ అంగీకరిస్తున్నామన్నమాట. అంటే, ప్రకృతి ప్రకృతిగానే వుంటుందనీ, దాని కొక చరిత్ర అంటూ వుండదనీ వాదిస్తున్నామన్నమాట. ఇది మెటఫిజికల్ సిద్ధాంతాల్లో మొదటి సిద్ధాంతమని సులభంగానే అర్థంచేసుకోవచ్చు.

మెటఫిజిషియన్లు సమాజంపట్లకూడా తమ సిద్ధాంతాలను యీవిధంగానే వర్తింపజేస్తారు. మానవసమాజం మారుతూ వుంటుందనే విషయాన్ని వారు గుర్తిస్తారు. వస్తూత్పత్తి ముడిపదార్థాలతో ప్రారంభమై వస్తువులరూపంలో అంతమవుతుంది; రాజకీయాల్లో ఒక ప్రభుత్వం తర్వాత మరొక ప్రభుత్వం అధికారంలోకి వస్తుంది. ఒక్కొక్కప్పుడు ఆర్థిక యంత్రం తుప్పుపట్టడంవల్లనో, మరో కారణంవల్లనో పట్టాలు తప్పుతూవుండవచ్చు; రాజ్యాంగయంత్రానికికూడా యీగతేపట్టవచ్చు; కాని నిపుణులసహాయంతో దాన్ని బాగుచేసి తిరిగి నడిపించవచ్చు- ఇదీ "యాంత్రిక భౌతికవాదులు" సామాజిక పరిణామసూత్రం. ప్రతి సామాజికవ్యవస్థకు ఒక చరిత్ర వుంటుందనిగాని, అది మరోవ్యవస్థగా మార్పు చెందుతుందనిగాని వారు గుర్తించరు.

ఆలోచనావిధానంలోకూడ వీరు యీపద్ధతినే అవలంబిస్తారు. ఉదాహరణకు, మానవుని ఆలోచనలు మొదటినుంచీ ఒకే విధంగా వున్నాయి. ప్రేమ, కరుణ, స్వేచ్ఛ మొదలైన భావాలు శాశ్వత సత్యాలు; అవి ఎల్లప్పుడూ నిలిచివుంటాయి. మానవుని ఆశయాలు, కోర్కెలు ఎల్లప్పుడూ ఒకేవిధంగా ఉంటాయి - ఇదీ "యాంత్రిక భౌతికవాదుల" ఆలోచనా విధానం:

మనలో చాలమందిమి ప్రతివిషయాన్నీ మెటఫిజికల్ దృక్పథంతో పరిశీలించడానికి అలవాటుపడ్డాం. అదే సరియైన, సహజమైన, వాస్తవికమైనపద్ధతి అని భావిస్తున్నాం. మెటఫిజికల్ సిద్ధాంతాలు తప్పు అని మనకు తోచినప్పటికీ, చాలాకాలంగా వున్న అలవాటునుబట్టి మనం యీ పద్ధతిలోనే ఆలోచిస్తూ వుండవచ్చు. మన అలవాటును మార్చుకున్నప్పుడుగాని యీపద్ధతికి స్వస్తిచెప్పలేం.

"యాంత్రిక భౌతికవాదులు" భావవాదాన్ని వ్యతిరేకించి, భౌతికవాదాన్ని ప్రచారం చేయడంద్వారా అప్పట్లో గొప్ప విప్లవపాత్ర

నిర్వహించినమాట వాస్తవమే అయినప్పటికీ, వారి ఆలోచనావిధానం మెటఫిజికల్ పద్ధతి కావడంవల్ల ప్రకృతిలోను, సమాజంలోను జరిగే మార్పుయొక్క స్వభావాన్ని వారు సమగ్రంగా గ్రహించలేకపోయారు. బూర్జువా సమాజమే శాశ్వతమైనదన్న అభిప్రాయానికి "యాంత్రిక భౌతికవాదులు" వచ్చారు. గతితార్కిక పద్ధతియే యీ లోపాన్ని సవరించి, బూర్జువా సమాజం సహితం శాశ్వతంకాదనీ, అది కూడా నశించక తప్పదనీ నిరూపించింది.



# ఏడవ అధ్యాయం

## గతితర్కం

ప్రపంచంలో మొట్టమొదటిసారి గతితార్కిక సిద్ధాంతాలను అభివృద్ధిచేసినది హెగెల్ అనుప్రఖ్యాత జర్మన్ భావవాది. ఈయన 1770-1831 మధ్య జీవించాడు. అంతవరకు శాస్త్రపరిశోధనల ఫలితాలను యితడు చక్కగా అర్థంచేసుకున్నాడు. హెరాక్లిటస్ అను ప్రాచీన గ్రీక్ తత్వవేత్త సిద్ధాంతాలను ఆధారంగాచేసుకొని, శాస్త్రపరిశోధనల సహాయంతో ప్రపంచంలో ప్రతిదీ మార్పుచెందుతుందనీ, ఒక దానితో ఒకటి సంబంధంలేని వస్తువులుగాని, జీవులుగాని, ఘటనలుగాని లేవనీ రుజువుచేశాడు.

క్లుప్తంగా ఆయన అభిప్రాయాలు యివి: పదార్థం వివిధ రూపాల్లో ఒక దశనుంచి మరో దశకు ఎడతెగకుండా నిరంతరం మార్పుచెందుతూవుంటుంది. మరోవైపు మనోభావాలు-అనగా మన ఆలోచనలు, ఆశయాలు, విలువలు, సాంప్రదాయాలు మొదలైనవి - ఒక దశనుంచి మరో దశకు ఎడతెగకుండా మార్పుచెందుతూవుంటాయి. ప్రపంచానికి మూలం యీ మనోభావాలే. మానవుడు తన మానసిక శక్తులద్వారా పదార్థాన్ని కంట్రోలు చేయగల్గుతున్నాడు. అవిధంగా అతని మానసిక అవసరాలుకూడా యీడేరుతున్నాయి. మనస్సు పదార్థాన్ని కంట్రోలుచేసేటప్పుడు - అనగా భౌతికప్రపంచాన్ని మార్చేటప్పుడు - మనస్సుకూడా క్రమాభివృద్ధి చెందుతుంది. ఇలా మానవుడు తన చరిత్రను తాను నిర్మించుకుంటాడు. కాని అదేసమయంలో అతని మానసిక శక్తులుకూడా అభివృద్ధి చెందుతాయి. ఏ దేశచరిత్రచూచినా, ఒక్కొక్క ప్రధానమైన మానసికపోకడ మనకు స్పష్టంగా కనిపిస్తూవుంటుంది. దానికనుగుణ్యంగా ఆదశ అభివృద్ధిచెందుతూ వుంటుంది. అనగా ఆర్థిక విధానం, సామాజిక వ్యవస్థ, రాజ్యాంగ యంత్రం మొదలైనవన్నీ ఆ ప్రధానపోకడకనుగుణ్యంగా వుంటాయి.

అయితే, ఆ మానసికపోకడ సమగ్రమైనదిగా వుండదు. అది మానవుని జీవితావసరాలను పూర్తిగా తీర్చలేదు. అందుచేతనే భావాలకూ - భౌతికావసరాలకూ మధ్య వైరుధ్యం తీవ్రరూపం దాల్చుతుంది. అప్పుడు ప్రధానపోకడ మార్పు చెందుతుంది. ఈ విధంగా మనోభావాలు క్రమంగా మార్పుచెంది, చివరకు "మహోన్నత మానసిక స్వాతంత్ర్యం" లభిస్తుంది.

అంటే హెగెల్‌దృష్టిలో నిరంతరం మార్పుచెందే యీ ప్రపంచానికి మూలం మనోభావ మన్నమాట. ఉదాహరణకు శాస్త్రపరిశోధకుడు తన మనస్సులోవున్న ఒక భావాన్ని క్రియారూపంలో పెట్టినప్పుడు పదార్థం మారుతోందిగనుక, మనోభావమే పదార్థానికి మూలమని హెగెల్ వాదించాడు. అతడొకవైపు మార్పు ఎడతెగకుండా జరుగుతుందని అంగీకరిస్తూనే, మరోవైపు "మహోన్నత మానసిక స్వాతంత్ర్యం" ఒకానొక దశలో లభిస్తుందన్నాడు. అనగా మార్పు అంతటితో ఆగిపోతుందనే అభిప్రాయాన్ని పరోక్షంగా అంగీకరిస్తున్నాడు.

ఈవిధంగా హెగెల్ సిద్ధాంతాలకు భావవాదం ప్రాతిపదిక. అయినప్పటికీ అతడు తత్వశాస్త్రానికి మూడు విధాలుగా సహాయం చేశాడు.

1. అంతవరకు తత్వశాస్త్రజ్ఞులు (భౌతికవాదులతో సహా) మార్పునుగురించి వివరించడంలో స్థలభావాన్ని మాత్రమే దృష్టిలో వుంచుకున్నారు. హెగెల్ మొట్టమొదటిసారి కాలాన్నికూడా దృష్టిలో వుంచుకోవాలన్నాడు.

2. మార్పును మనం చరిత్రదృష్ట్యా పరిశీలించాలన్నాడు.

3. ప్రతి వస్తువు అనేక భాగాల సముదాయం మాత్రమేకాదనీ, పరస్పర వైరుధ్యాలతో కూడు కునివున్న భాగాల సముదాయమనీ అతడు కనుగొన్నాడు. అంతేకాదు. ప్రతి వస్తువూ అనేక వస్తువులలో ఒకటి; దానికీ, యితర వస్తువులకూ (అనగా దాని పరిసరాలకూ) మధ్య ఎల్లప్పుడూ సంఘర్షణ జరుగుతూవుంటుంది. ఈ సంఘర్షణవల్లనే దానిగుణం మారుతూవుంటుంది - అని అతడు సహేతుకంగాను, పరిశోధనలద్వారాను రుజువుచేశాడు.

ఈవిధంగా హెగెల్ మొట్టమొదటిసారి గతితార్కిక పద్ధతిలో ప్రపంచాన్ని పరిశీలించాడు. అయితే, అతడు భావవాదిగనుక అతని సిద్ధాంతాల్లో సహజంగా పరస్పర వైరుధ్యాలు కనబడతాయి.

మార్క్స్, ఎంగెల్స్‌లు యితనిలోని భావవాదాన్ని విసర్జించి, గతితార్కికపద్ధతిని స్వీకరించారు. వారి అభిప్రాయం ప్రకారం, ప్రపంచంలోని భౌతికశక్తులే మార్పుకు కారణం. మొదట భౌతికశక్తుల ప్రభావం మన ఆలోచనలమీద పడుతుంది. అప్పుడు మనకున్న సాధనసంపత్తితో ప్రపంచాన్ని మార్చడానికి పూనుకుంటాం.

మార్క్స్ తనకూ, హెగెల్‌కీ గల వ్యత్యాసాన్ని యీ కింది వాక్యాలలో వివరించాడు:

"నా గతితార్కిక సిద్ధాంతానికీ, హెగెల్ గతితార్కిక సిద్ధాంతానికీ చాలా భేదం వుంది. అంతేకాదు. నా సిద్ధాంతం హెగెల్ సిద్ధాంతానికి పూర్తిగా వ్యతిరేకం. హెగెల్ అభిప్రాయంలో ఆలోచనాక్రమం మనోభావమనేపేరుతో ఒక స్వతంత్రశక్తిగా వ్యవహరిస్తుంది; అదే వాస్తవజగత్తుకు మూలం; మనోభావంయొక్క బాహ్యస్వరూపమే వాస్తవజగత్తు. కాని నా అభిప్రాయంలో వాస్తవజగత్తుయొక్క ప్రతిబింబమే మనోభావం. అది ఆలోచనరూపంలో బహిర్గతమవుతూవుంటుంది."

ఈ సందర్భంలో ఎంగెల్స్ చెప్పిన మాటలుకూడా గమనించదగినవి. అతడు యిలా అన్నాడు: "హెగెల్ వివరించిన గతితార్కికసిద్ధాంతం తలకిందులుగావుంది; దాన్ని మనం కాళ్ళమీద నిలబెట్టవలసియుంది."

ప్రపంచం, మనోభావాలు నిరంతరం మార్పుచెందుతా యన్నంతవరకు హెగెల్ సిద్ధాంతం సరియైనదే; కాని పదార్థంలో కలిగే మార్పుకు. మనోభావాలు కారణమని చెప్పడం సరికాదు. వివిధ వస్తురూపాలలో వున్న పదార్థమే మన ఆలోచనలకు రూపురేఖలు దిద్దుతుంది. వస్తువులలో కలిగే మార్పు కనుగుణ్యంగానే మన ఆలోచనలుకూడా మారుతాయి.

ఉదాహరణకు పూర్వం ప్రజల్లో అధికసంఖ్యాకులు రెండెడ్లబండ్లలో ప్రయాణంచేసేవారు. ఇప్పుడు మనం రైళ్ళలో ప్రయాణం చేస్తున్నాం. రైలుప్రయాణం చేయాలనే మనోభావం మనలో ఏర్పడ్డంవల్ల కాదుకదా రైళ్ళువచ్చింది! ప్రపంచంలో మొట్టమొదటిరైలు ఇంజనును కనిపెట్టినవ్యక్తి తనకు ముందు జరిగిన శాస్త్రపరిశోధనల ఆధారంమీదనేగదా ఇంజనునిర్మాణాన్ని గురించి ఆలోచించగలిగాడు!

అందుచేత మార్క్స్, ఎంగెల్స్‌లు హెగెల్‌యొక్క గతితార్కిక సిద్ధాంతాన్ని భౌతికవాద పునాదిపై పునర్నిర్మించారన్నమాట.

"ప్రపంచంలో ఏవస్తువూ ఒకచోట వుండదు. ప్రతీదీ మార్పుచెందుతుంది" అనే మాటల్లో గతితర్కంయొక్క సారాంశం యిమిడివుంది.

ఉదాహరణకు ఒక మామిడికాయను తీసుకుందాం. దాన్ని మనం రెండువిధాలుగా పరిశీలించవచ్చు: మొదటిది మెటఫిజికల్ పద్ధతి; రెండవది గతితార్కిక పద్ధతి. మెటఫిజికల్ పద్ధతిప్రకారం మనం ఆ మామిడికాయయొక్క సైజును, రంగును, రుచిని వర్ణిస్తాం. దాన్ని జామకాయతోగాని, మరోకాయతోగాని పోల్చి, తారతమ్య మేమిటో చెప్పి, యిలాముగిస్తాం: మామిడికాయ వేరు; జామకాయ వేరు; నారింజకాయ వేరు.

కాని గతితార్కికపద్ధతిలో మనం ఆ మామిడికాయను పరిశీలించ దలచుకుంటే, దానిలో కలిగే మార్పుల్నికూడా జాగ్రత్తగా పరిశీలించ వలసియుంటుంది. అప్పుడు మామిడికాయ ఎల్లప్పుడూ యిలాగే లేదని మనం గుర్తించగల్గుతాం. మొదట అది పిందెరూపంలో వుండేది; అంతకుముందు పువ్వు రూపంలో వుండేది; ఆ పువ్వు మొగ్గలోనుంచి పుట్టింది. అంటే మామిడికాయ ఎల్లప్పుడూ మామిడికాయగా లేదనీ, దానికొక చరిత్రవుందనీ మనకు బోధపడుతుంది. ఇప్పుడది యే రూపంలో వుందో, ఎల్లప్పుడూ అదేరూపంలో లేదని స్పష్టమవుతుంది. కొన్నాళ్ళకు అది పండి కిందపడుతుంది; ఆ తర్వాత మళ్ళీ మట్టిలో కలిసిపోతుంది; కొన్నాళ్ళకు దాని టెంకలోనుంచి మొక్క మొలుస్తుంది. ఆ మొక్క పెరిగి వృక్షమవుతుంది. అంటే, మామిడికాయ ఎల్లప్పుడూ మామిడికాయగా ఎలాలేదో, అలాగే యికముందుకూడా అది మామిడికాయగా వుండదన్నమాట.

ఈవిధంగా మనం మామిడికాయను భూత, వర్తమాన, భవిష్యత్కాలాలను దృష్టిలోవుంచుకొని పరిశీలిస్తే, అది అంతకుముందున్న దశకూ, ఇక ముందుండేదశకూ మధ్య ఒక పరివర్తనదశ అని మనకు బోధపడుతుంది.

మరొక ఉదాహరణ: మానవసమాజంలో పేదలు, ధనికులు ఎల్లప్పుడూ వుంటారని వాదించేవారున్నారు. పెద్ద పెద్ద బ్యాంకులు, ఫ్యాక్టరీలు, రైల్వేలతో కూడివున్న పెట్టుబడిదారీవ్యవస్థను వర్ణించి, దాన్ని

అంతకు ముందున్న భూస్వామ్యవిధానంతోనో, బానిసవిధానంతోనో వేరుచేసి "పెట్టుబడిదారీవిధానం వేరు; భూస్వామ్యవిధానం వేరు" అని వాదించడం మెటఫిజికల్‌పద్ధతి. గతితార్కిక దృక్పథంతో పరిశీలిస్తే, పెట్టుబడిదారీవిధానంయొక్క బీజాలు భూస్వామ్య విధానంలోనే మొలకెత్తాయని మనకు స్పష్టమవుతుంది. అదే విధంగా సోషలిస్టు సమాజంయొక్క బీజాలు నేటి పెట్టుబడిదారీవిధానం సామాజికపరిణామంలో ఒక పరివర్తనదశగా మనం చూడగల్గుతాం.

ప్రపంచంలో ఏదీ శాశ్వతంకాదు; ప్రతీదీ పుట్టి, పెరిగి, నశిస్తుంది. బాలుడు యువకుడుగాను, యువకుడు వృద్ధుడుగాను మారి చివరకు మరణిస్తాడు; సామాజికవ్యవస్థలుకూడా యింతే - ఇదీ గతితార్కిక ఆలోచనాపద్ధతి.

మామిడికాయకు ఒక చరిత్రవుందని పైన చూచాం. అలాంటిదే మరొక ఉదాహరణ తీసుకుందాం. మనం వుపయోగించే పెన్సిలుకుకూడా ఒక చరిత్రవుంది. ఏ కర్రముక్కతో అది చేయబడిందో అది ఒక దుంగలో ఒక భాగం. ఆ దుంగ అడవిలోవున్న చెట్టును నరికి, రంపంతో కోయడంవల్ల లభించింది. ఈవిధంగా మామిడికాయకు, పెన్సిలుకు ఒక్కొక్క చరిత్ర వుంది. అయితే రెండిటి చరిత్రలు ఒకే విధమైనవి కావు. మామిడిపిందె పెద్దదై కాయగా మారుతుంది. అది పరిపక్వదశకువస్తే పండుతుంది. అనగా మామిడికాయలో పై మార్పులు తప్పనిసరిగా వాటంతట అవి జరుగుతాయి. పెన్సిలు విషయం అలా కాదు. ఏ చెట్టునుంచి పెన్సిలు తయారు చేయబడిందో, ఆ చెట్టు దానంతట అది దుంగగా మారదు. ఆ దుంగనుంచి పెన్సిలు దానంతట అది తయారుకాదు. ఒక దశలోవున్న మామిడికాయను మనం చూస్తే, దాని తర్వాతదశ ఏమిటో తెలుస్తుంది. కాని పెన్సిలు విషయమలా తెలియదు. ఇతరులు జోక్యం కలిగించుకోవడంవల్లనే అది అనేకదశలు గడిచి పెన్సిలురూపం ధరించింది.

పచ్చి మామిడికాయ పండుగా మారడానికి కారణమేమిటి? అలా మారేగుణం దానిలో ఉండడంవల్లనే. మామిడిపువ్వును, తర్వాత మామిడిపిందెను, ఆతర్వాత మామిడికాయను జాగ్రత్తగా పరిశీలించినట్లయితే, కొన్ని ఆంతరంగిక శక్తులవల్ల అది అలా మారుతూందని గ్రహించవచ్చు. అంటే ఈ మార్పుల వెనుక

స్వయంగమనశక్తి (Autobynamism) వుందని తెలుసుకోవచ్చు. కాని పెన్సిలు దుంగరూపంలో వున్నప్పుడు దాన్ని పెన్సిలుగా మార్చడానికి బయటశక్తి ఒకటి జోక్యం కలిగించుకోవలసివచ్చింది. అంటే, దుంగ పెన్సిలుగామారడం స్వయంగమనశక్తివల్ల కాదనేది స్పష్టం.

అందుచేత గతితార్కిక మార్పులో స్వయంగమనశక్తి ఒక ప్రధాన విషయమని మనం గ్రహించాలి. అన్ని మార్పులూ గతితార్కికమార్పులు కావని తెలుసుకోవాలి. మన మొక ఈగను పట్టుకొని, దాని గతితార్కికదృష్టితో పరిశీలిస్తున్నామనుకుందాం. అది యెల్లప్పుడూ ఒకేవిధంగా వుండదనీ, అనేక దశల్లో మార్పు చెందుతుందనీ మనం తెలుసుకుంటాం. అయితే, ఆ ఈగను నలిపి చంపివేస్తే కలిగే మార్పు గతితార్కికమార్పు కాజాలదు. మనం జోక్యం కలిగించుకుని యుండకపోతే అది బతికియుండేది. అందుచేత మనజోక్యంవల్ల కలిగిన యీమార్పు యాంత్రికమార్పు.

ఇక్కడ మన మొక విషయం గుర్తించాలి. మానవుని జోక్యంవల్ల కలిగే అన్నిమార్పులూ యాంత్రికమార్పులే· ననుకోవడం పొరబాటు. సమాజంలోనూ, ప్రకృతిలోనూ గతితార్కిక సూత్రాల కనుగుణ్యంగా జరిగేమార్పును మానవుడు గమనించి, తదనుగుణ్యంగా స్వీయాభివృద్ధికి కృషిచేయగలడు. మానవుడు శాస్త్రీయపద్ధతిలో కార్యాచరణకు పూనుకొనేందుకు గతితార్కికపద్ధతి ఎంతో సహాయపడుతుంది. మార్క్సిస్టు సిద్ధాంతం మానవసమాజానికి చేసిన మహోన్నతసేవ యిదే.

అందుచేత గతితార్కికవాది వాస్తవవిషయాలను పరిశీలించి, ఏ యే దశల్లో అవి పరిణామం చెందుతూ వచ్చాయో కనుక్కోవాలి. వస్తువులన్నీ యిప్పుడున్నవిధంగా లేవని చెప్పి వూరుకోవడంతోనే సమస్య పరిష్కారమైపోదు. పూర్వం అవెలా ఉండేవో వివరంగా పరిశీలించాలి. పెటుబడిదారీవ్యవస్థకు ముందున్న వ్యవస్థ లెలాంటివో, అవి యే విధంగా మార్పుచెందాయో తెలుసుకోవడానికి మార్క్స్, ఎంగెల్స్‌లు సమగ్రమైన పరిశోధనలు చేశారు. లెనిన్‌కూడా వారిలాగే పెట్టుబడిదారీ సమాజంలోని మార్పులను తెలుసుకోవడానికి, సామ్రాజ్యవాద దశను వివరించడానికి అనేక వివరాల్లోకి వెళ్ళి పరిశీలనలు చేశాడు.

అందుచేత, "స్వయంగమనశక్తి" అనే మాటను మనం ఎంతో బాధ్యతతో వాడాలి.



# ఎనిమిదవ అధ్యాయం

## గతితార్కిక భౌతికవాదం

మన మొక వస్తువునుగాని, ఘటననుగాని పరిశీలించిన తర్వాత, దాని "స్వయంగమనశక్తి"ని తెలుసుకున్న తర్వాత, ఆశక్తి దానికి యెలా వచ్చిందో చూడవలసియుంది.

ఇందుకు మూడు ప్రధాన సూత్రాలున్నాయి: 1. పరస్పర విరుద్ధశక్తులమధ్య సంఘర్షణ 2. విరోధ వైరుధ్య సూత్రం 3. పరిమాణం గుణంగా మారే పద్ధతి.

ఈ మూడూ గతితార్కిక భౌతికవాద సూత్రాలు. వాటినిగురించి తెలుసుకోనేముందు అవి ప్రతిపాదింపబడిన నాటి పరిస్థితులనుగురించి వివరించడం అవసరం.

మార్క్స్, ఎంగెల్స్‌లు మార్పునుగురించి పరిశీలించడంలో అంతవరకూ సాంప్రదాయసిద్ధంగా అమల్లోవున్న మెటఫిజికల్‌పద్ధతిని విసర్జించడానికీ, గతితార్కికపద్ధతిని చేబట్టగలగడానికీ ప్రధానకారణం మూడు గొప్ప శాస్త్రపరిశోధనలు. 19వ శతాబ్దంలో జరిగిన యీ మూడు పరిశోధనలే గతితార్కిక భౌతికవాదానికి పునాదిరాళ్ళు. ఈ మూడు పరిశోధనలు జరిగియుండకపోతే, మార్క్స్, ఎంగెల్స్‌లు మానవ సమాజాన్ని గురించిగాని, పెట్టుబడిదారీ విధానాన్ని గురించిగాని గతితార్కిక దృక్పథంతో పరిశీలనలు జరపగలిగేవారుకారు; పెట్టుబడిదారీవిధానం నశించితీరుతుందనీ, సోషలిస్టు సమాజం ఏర్పడక తప్పదనీ చెప్పగలిగేవారు కారు.

ఆ మూడుపరిశోధనలు ఏమిటో చూదాం. మొదటిది: జీవకణం - దాని అభివృద్ధిక్రమం. ప్రపంచంలోని జీవరాసులు వివిధ జాతులకు చెందివున్నాయనీ, ఒక జాతికీ, మరోజాతికీ సంబంధం లేదనీ, దేనికది వేర్వేరుగా పుట్టడం, పెరగడం, నశించడం జరుగుతోందనీ అనేక

సంవత్సరాలనుంచి జీవశాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతూవచ్చారు. 19వ శతాబ్దంలో జీవకణాల అభివృద్ధిగురించి కనిపెట్టబడిన కొత్త సిద్ధాంతం పై అభిప్రాయాన్ని పటాపంచలుచేసింది. ప్రతి జీవి అనేక జీవకణాల సముదాయమనీ, ఎల్లప్పుడూ పాత జీవకణాలు చస్తూ, కొత్తవి పుడుతూ వుంటాయని తెలుసుకోవడాని కవకాశం కలిగింది. వృక్షజాతులకూ, జంతుజాతులకూ మధ్య అభేద్యమైనగోడ ఏదీ లేదనికూడా రుజువయింది.

రెండవది: శక్తి రూపాంతరంచెందడం, ప్రకృతిలో శక్తి (Energy) వివిధ రూపాల్లోవుంది. ఉదా: చలనం, వేడి, వెలుతురు, శబ్దం వగైరా. ఇవన్నీ ఒక రూపంలోనుంచి మరొక రూపంలోకి మారుతున్నాయి. ఉదాహరణకు మేఘాల రాపిడివల్ల ఉరుములు (శబ్దం), మెరుములు (వెలుతురు), పిడుగులు (వేడి) ఏర్పడుతున్నాయి. విద్యుచ్ఛక్తితో మనం దీపాలు వెలిగిచుకుంటున్నాం (వెలుతురు); పంకాలు తిప్పుకొంటున్నాం (చలనం); ఎలక్ట్రిక్‌స్టౌవ్‌తో వంటచేసుకుంటున్నాం (వేడిమి); ఇంకా అనేక ప్రయోజనాలు సాధిస్తున్నాం.

మూడవది: పరిణామసూత్రం. జీవం వున్నవస్తువులన్నీ అనేక పరిణామదశల ఫలితంగా యేర్పడ్డాయనీ, మొట్టమొదట అవి ఏకకణజీవులుగా వుండేవనీ అనేక లక్షల సంవత్సరాల పరిణామదశల్లో వివిధ రూపాలు ధరించాయనీ డార్విన్ అను జీవశాస్త్రవేత్త అనేక పరిశోధనలద్వారా రుజువుచేశాడు. ఈ జీవరాసులు బతుకుతెరువుకోసం ప్రకృతితో జరపవలసిన పోరాటాల్లో కొన్ని ఓడిపోయి నశించాయనీ, గెలిచి నిలబడ్డవి అనేక కొత్త అవయవాలతో, గుణాలతో జీవించివున్నాయనీ ఎన్నో ఉదాహరణలు అతడు చూపెట్టాడు. ఇందు కతడు భూగర్భంలో అనేక సంవత్సరాల కిందట జీవించిన జీవరాసుల శరీరావశేషాలను తవ్వి పరిశోధించాడు. మానవుడు యిట్టి పరిణామక్రమంలో ఒక ఉన్నతోన్నతదశ అనికూడా అతడు వివరించాడు.

పై మూడు పరిశోధనలవల్లనే ప్రకృతిలో జరిగే ఘటనల మధ్య అన్యోన్య సంబంధాలను గురించి మనం తెలుసుకోగల్గుతున్నాం.

ఇప్పుడు గతితార్కిక భౌతికసూత్రాలలో మొదటిదైన పరస్పర విరుద్ధశక్తుల సంఘర్షణనుగురించి తెలుసుకుందాం.

ప్రతి వస్తువులోను, లేదా ప్రతి జీవిలోను, లేదా ప్రతి వ్యవస్థలోను రెండు విరుద్ధశక్తులు ఒకదానితో ఒకటి కలిసి వుంటూనే, వాటి మధ్య

నిరంతర సంఘర్షణ జరుగుతూ వుంటుంది. ఈ సంఘర్షణవల్లనే ఆ వస్తువు లేదా జీవి లేదా వ్యవస్థ అభివృద్ధి చెందుతుంది.

ఉదాహరణకు జీవించడం, మరణించడం రెండు పరస్పర విరుద్ధమైన సంఘటనలు; మెటఫిజికల్ దృష్టితో ఆలోచించేవారు ఈ రెండింటినీ వేర్వేరుగా పరిశీలిస్తారు; రెండిటిమధ్య ఎట్టి సంబంధం లేనట్లు భావిస్తారు; జీవించడం వేరు, మరణించడం వేరు అనే నిర్ధారణకు వస్తారు. ఎవ్వరూ ఒకేసారి జీవించడం, మరణించడం జరగదుకదా అని తేల్చివేసారు.

కాని, లోతుగా పరిశీలిస్తే, ఈ రెంటినీ విడదీయడానికి వీల్లేదు.

చావు పుట్టకనుంచి వచ్చింది; ఇదేవిధంగా చావునుంచి పుట్టుక సంభవమా? తప్పకుండా సంభవమే. మానవశరీరంలో నిరంతరం కొన్ని జీవకణాలు చనిపోవడం, మరికొన్ని జీవకణాలు పుట్టడంవల్లనే మనిషి, జీవించగలుగుతున్నాడు. కొత్తగా పుట్టే జీవకణాలసంఖ్య అధికంగా ఉన్నంతకాలం మానవుడు పెరుగుతూ వుంటాడు; వాటి సంఖ్య తగ్గి మరణించేవాటి సంఖ్య ఎక్కువైనప్పుడు మానవుడు వృద్ధాప్యంలో ప్రవేశించాడంటాం. అంతేగాక, చనిపోయినవాని శరీరంనుంచి అనేక కొత్తజీవులు ఉద్భవించి, భూమికి ఎరువుగా వుపయోగపడుతున్నాయి.

మన మొక మామిడిపండు నేలమీద పడివుండగా చూచామనుకుందాం. మామిడికాయ పండుగామారి యే నిమిషాన కింద పడిందో ఆ నిమిషంనుంచీ అది కుళ్ళడం ప్రారంభించిందనికూడా మనం మరచిపోకూడదు.

అందుచేత నూటికి నూరు పాళ్ళూ జీవించడం వుండదు. నూటికి నూరు పాళ్ళూ మరణించడం వుండదు.

అందువల్ల ప్రతి వస్తువులోను రెండు విరుద్ధ లక్షణాలు యిమిడి వున్నాయని స్పష్టమవుతుంది. మన మొక వస్తువును వలయాకారంగా ఊహించుకొని పరిశీలిస్తే, అందులో ఒక శక్తి జీవితంవైపు - అనగా పరిధివైపు - లాగుతూ వుంటుంది; మరో శక్తి మరణంవైపు - అనగా కేంద్రంవైపు - నొక్కుతూవుంటుంది. ఈ విధంగా రెండిటిమధ్య ఎల్లప్పుడూ సంఘర్షణ జరుగుతూ వుంటుంది. ప్రతి వస్తువులోను ముందుకు తోసేశక్తి, వెనక్కులాగేశక్తి వుంటాయి. ఆ వస్తువును

జీవింపజేసే శక్తి ఒకటి, నశింపజేసేశక్తి ఒకటి వుంటాయి. ఈ రెండింటి మధ్య నిరంతరం జరిగే ఘర్షణవల్ల ఆ వస్తువు మార్పుచెందుతూ వుంటుంది.

ఇందుకు మన నిత్య జీవితంనుంచి ఎన్ని ఉదాహరణలైనా యివ్వవచ్చు.

మన శరీరాల్లో పరిశుభ్ర రక్తం, అపరిశుభ్ర రక్తం వున్నాయి. పరిశుభ్రరక్తం తనలోవున్న ప్రాణవాయువును కోల్పోతూ బొగ్గుపులుసు వాయువును తీసుకోవడం ద్వారా అపరిశుభ్ర రక్తంగా మారుతోంది. ఇలాగే అపరిశుభ్రరక్తం తనలోవున్న బొగ్గుపులుసు వాయువును కోల్పోతూ ప్రాణవాయువును తీసుకోవడంద్వారా పరిశుభ్ర రక్తంగా మారుతోంది. ఈ రెండు రక్తాలూ మన శరీరాల్లో ఎల్లప్పుడూ ప్రవహిస్తూండడంవల్లనే అవి పెరుగుతున్నాయి.

విద్యుచ్ఛక్తిలోని పాజిటివ్ కరెంటును నెగెటివ్ కరెంటును ఒకచోటికి చేర్చినప్పుడే దీపం వెలుగుతుంది. ఈ రెండింటిలో ఏది లేకపోయినా విద్యుచ్ఛక్తి ఏర్పడదు; దీపమూ వెలగదు. సూదంటురాయిలో ఉత్తరధృవం, దక్షిణధృవం అనే రెండుకొన లుండడంవల్లనే దానికి ఆకర్షణశక్తి వస్తోంది. పరమాణువు లన్నిటిలోను ఒక్కొక్క ప్రోటాను, అనేక ఎలక్ట్రానులు వుండి రెండింటిమధ్య నిరంతర సంఘర్షణ జరుగుతూవుంటుంది.

ఈవిధంగా ప్రతివస్తువూ రెండు విరుద్ధశక్తుల సమ్మేళనంగా వుంటుంది. మెటఫిజికల్ దృక్పథంతో పరిశీలించేవారికి యిది అసంభవంగా కనిపిస్తుంది. వారి అభిప్రాయం ప్రకారం రెండింటిమధ్య ఎట్టి సంబంధం వుండదు. ఒక్కొక్క వస్తువు ఒక్కొక్క ముక్కతోనే తయారుచేయబడినట్టు వారు భావిస్తారు. రెండు ముక్కలతో - రెండు పరస్పర విరుద్ధలక్షణాలుగల ముక్కలతో - అది తయారయిందంటే నమ్మరు. ఆ రెండిటి మధ్య నిరంతరం సంఘర్షణ జరుగుతూవుంటుందని అంటే అది వారికి విడ్డూరంగా కనిపిస్తుంది.

జ్ఞానం, అజ్ఞానం అనే గుణాలు రెండూ మెటఫిజికల్ దృక్పథం ప్రకారం పరస్పర సంబంధంలేని రెండు విరుద్ధమైన శక్తులు. కాని వాస్తవానికి యీ రెండూ కలిసే ఉంటాయి. ఏవ్యక్తీ సంపూర్ణమైన అజ్ఞాని అనిగాని, సంపూర్ణమైన జ్ఞాని అనిగాని మనం చెప్పలేం.

ఒక వ్యక్తి ఎంత అజ్ఞానిగావున్నా, తిండి, గుడ్డ, యిల్లు మొదలైన కొన్ని అత్యవసర వస్తువుల్నిగురించి కొంతైనా జ్ఞానం అతనికి వుంటుంది.

ఇలాగే, అనేక కొత్త విషయాలు తెలుసుకొనేకొద్దీ, తెలియని ఎన్నోవిషయాలు బయటపడుతూవుంటాయి. ఒక చక్కని పుస్తకం చదువుతూన్నప్పుడు మన జ్ఞానం ఎంతో అభివృద్ధి చెందుతుంది; కాని అదే సమయంలో మన పూర్వపు అజ్ఞానం బయటపడుతూవుంటుంది; చదివేకొద్దీ తెలుసుకోవలసిన విషయాలనేకం కనబడతాయి.

ఈ సూత్రాన్నే ఆధారంగా చేసుకుని మార్క్స్, ఎంగెల్స్‌లు పెట్టుబడిదారీ విధానాన్ని గురించి ఎన్నో పరిశోధనలు చేశారు. పెట్టుబడిదారీ విధానంలోని అంతర్వైరుధ్యాల నాధారంగా తీసుకుని, మానవసమాజం పెట్టుబడిదారీవిధానం నుంచి సోషలిజంలోకి మారితీరుతుందని రుజువుచేశారు. ఏవిధంగానో చూదాం.

పెట్టుబడిదారీవర్గం అభివృద్ధిచెందడానికి అనేకమంది కార్మికుల్ని ఒకేచోట కేంద్రీకరించి పనిచేయిస్తేగాని కార్మికుల శ్రమశక్తిని దోచుకుని లాభాలు సంపాదించడం సాధ్యంకాదు. అనగా కార్మికులు పెట్టుబడిదారీ వర్గానికి మూలాధార మన్నమాట. అయితే, కార్మికులు యీ దోపిడీని తమ సంఘటిత శక్తిద్వారా ప్రతిఘటిస్తారు. ఈ విధంగా పెట్టుబడిదారీవిధానంలో రెండు శత్రువర్గాలమధ్య సంఘర్షణ జరుగుతూ వుంటుంది. పెట్టుబడిదారీ వర్గానికి మూలాధారమైన కార్మిక వర్గమే పెట్టుబడిదారీవిధానాన్ని నాశనంచేసే శక్తిగా మారుతుంది.

పెట్టుబడిదారీ సమాజానికి ముందు భూస్వామ్యయుగంలోను, అంతకు ముందు బానిసయుగంలోను కూడా రెండు ప్రధానవర్గాలమధ్య పోరాటం ఎల్లప్పుడూ జరుగుతూ ఉండేది. బానిసలు బానిస యజమానులమీద, అర్ధబానిసలు భూస్వాములమీద పోరుసల్పేవారు. ఇదేవర్గపోరాటం. ఈవర్గపోరాటమే సమాజ పరిణామానికి చోదకశక్తి.

పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాదంగా రూపొందినప్పటినుంచీ కొత్తవైరుధ్యం ప్రవేశించింది. అదే సామ్రాజ్యవాదానికీ వలసప్రజలకూ మధ్య వైరుధ్యం. కార్మికవర్గమేగాక, వలసదేశాల ప్రజలు సామ్రాజ్యవాదులపై జరిపే జాతీయ విముక్తి పోరాటాలు కూడా ప్రపంచ పెట్టుబడిదారీ విధానాన్ని కూల్చడంలో ప్రముఖపాత్ర వహిస్తున్నాయి. చైనా విప్లవమే యిందుకు ప్రబల తార్కాణం.

వివిధదేశాల్లో కమ్యూనిస్టుపార్టీలు అనుసరించే నిర్మాణ పద్ధతుల్లోకూడా పరస్పర విరుద్ధశక్తుల మధ్య సంఘర్షణతోబాటు సమైక్యత మనకు గోచరిస్తుంది.

ఉదాహరణకు విమర్శన, ఆత్మవిమర్శన తీసుకుందాం. కమ్యూనిస్టుపార్టీ సభ్యులు లేదా పార్టీ కమిటీలు యితరుల లోపాలను విమర్శించడంమీదే తమదృష్టిని కేంద్రీకరిస్తే అంతఃకలహాలతో పార్టీ ఛిన్నాభిన్నమవుతుంది. విమర్శనతోబాటు ఆత్మవిమర్శనకుకూడా సమాన ప్రాధాన్యత యిస్తే పార్టీ అంతకంతకు అభివృద్ధి చెందుతుంది. ఈ రెండు విరుద్ధ శక్తుల్నే ఎంత నేర్పుతో సమన్వయపరిస్తే అంతగా పార్టీ బలపడుతుంది. కేంద్రీకృత ప్రజాస్వామ్యం విషయం కూడా యింతే. పార్టీలో ప్రజాస్వామ్యం మాత్రమే ఉండి మెజారిటీ నిర్ణయాలను మైనారిటీ అమలుజరిపి తీరాలనే నిబంధన (కేంద్రనాయకత్వం) లేకపోతే ఏ కార్యక్రమమూ అమలు జరగదు. అలాగే ప్రజాస్వామ్యం లేని కేంద్రనాయకత్వం నిరంకుశత్వానికి మారుపేరు. ఈ రెండిటినీ సమర్ధవంతంగా సమన్వయపరిస్తేనే పార్టీ శక్తివంతంగా అభివృద్ధి చెందుతుంది.

ప్రజలనుంచి నేర్చుకోవడం, ప్రజలకు నాయకత్వం వహించడం - ఈ రెండూ కూడా కమ్యూనిస్టుపార్టీకి అవసరమే. దేన్ని విస్మరించినా పార్టీ దెబ్బతింటుంది. ప్రజలనుంచి నేర్చుకోవడం మీదనే దృష్టినంతా కేంద్రీకరిస్తే విప్లవపార్టీగా అది వృద్ధిచెందదు. ప్రజలకు నాయకత్వం వహించడం మీదనే దృష్టిని కేంద్రీకరిస్తే, వారి అభిప్రాయాలతో నిమిత్తంలేని ఒంటెత్తు మార్గాలవలంబించి ప్రజాఉద్యమం బలహీనపడేందుకు దోహదమిస్తుంది.

గతితార్కిక భౌతికవాదసూత్రాలలో రెండవది విరోధ వైరుధ్యసూత్రం (Negation of the Negation). ప్రతి వస్తువు, లేదా ప్రతి జాతి, లేదా ప్రతి వ్యవస్థ అంతర్వైరుధ్యాల సంఘర్షణద్వారా మార్పుచెందడమంటే అర్థం, దాన్ని విధ్వంసంచేసే మరోశక్తి అందులోనే అంతర్భాగంగా వుంటూ, పరిపక్వదశకు వచ్చిన వెంటనే ఆ వస్తువును, లేదా ఆ జీవిని, లేదా ఆ వ్యవస్థను నాశనం చేస్తుందన్నమాట. కాని యీ విధ్వంసకశక్తి తననుకూడ నాశనంచేసే మరొక విధ్వంసకశక్తిని సృష్టించుకుంటుంది. ఈవిధంగా ప్రపంచంలో పాతది విధ్వంసం కావడం

ద్వారా కొత్తది ఉద్భవిస్తుంది. అయితే, మొదటి వస్తువుకంటె రెండవది ఉన్నతస్థాయిలో వుంటుంది.

ఉదాహరణకు మనం తినే ధాన్యపుగింజను భూమిలో నాటి, నీరు పోస్తాం. ఆ నీటి ప్రభావంవల్ల, శీతోష్ణస్థితివల్ల ధాన్యపుగింజనుంచి మొక్క బయల్దేరుతుంది. అది భూమిని చీల్చుకుని, క్రమంగా పెరుగుతుంది. అదేసమయంలో గింజ నశిస్తుంది. ఏ ధాన్యపుగింజ నుంచి మొక్క మొలిచిందో ఆ ధాన్యపుగింజ మొక్కచేత విధ్వంసం చేయబడుతుంది. తర్వాత మొక్క క్రమంగా పెరుగుతుంది. కొన్నాళ్ళకు వెన్నులువేస్తుంది. ఆ వెన్నులలో కొన్నివందల ధాన్యపుగింజలుంటాయి. కాని మొక్క క్రమంగా చచ్చిపోతుంది. ఓ ధాన్యపు మొక్కనుంచి వెన్నులు బయల్దేరాయో ఆ మొక్క వెన్నులచే విధ్వంసం చేయబడిందన్నమాట. మొదటి గింజను విధ్వంసంచేసి మొక్క మొలిచింది. తరువాత ఆ మొక్క కొన్ని వందల గింజలచే విధ్వంసం చేయబడింది.

మరొక ఉదాహరణ: కోడిపెట్ట గుడ్డు పెడుతుంది. పెట్ట ఆ గుడ్డును పొదుగుతుంది. అప్పుడు ఆ గుడ్డులో ఒక సూక్ష్మజీవిని మనం చూడవచ్చు. అది ఒకనొక ఉష్ణోగ్రతలో పెరిగి పెద్దదవుతుంది. మొదటినుంచీ ఆ గుడ్డులో రెండు పరస్పర విరుద్ధశక్తులు పనిచేస్తూవుంటాయి. ఒకటి కోడిపిల్లగా మారేశక్తి, రెండవది గుడ్డుగా వుండేశక్తి. ఈ రెండింటి మధ్య జరిగే సంఘర్షణవల్ల కొన్నాళ్ళకు కోడిగుడ్డు పగిలి పిల్ల బయటికి వస్తుంది. అంటే కోడిపిల్ల గుడ్డును విధ్వంసంచేసిందన్నమాట.

రెండవదశలో కోడిపిల్ల పెరిగి, పెద్దదై అనేక గుడ్లు పెడుతుంది. ఈగుడ్లు పెట్టను విధ్వంసంచేస్తాయి. (పెట్ట వెంటనే చనిపోకపోవచ్చు; కొన్ని సంవత్సరాల తర్వాత చనిపోతుంది.)

ఇంకొక ఉదాహరణ: సీతాకోకచిలుక గుడ్డును పగులగొట్టుకొని పైకి వస్తుంది. అనేక రూపాలు ధరిస్తూ పెరుగుతుంది. కొంతకాలమయాక మగపురుగుతో సంగమం చేస్తుంది. అనేక గుడ్లు పెడుతుంది. వెంటనే చనిపోతుంది. ఒక్కొక్క గుడ్డు కొన్నాళ్ళ తర్వాత పగిలి పిల్లలు బయటికి వస్తాయి.

ఇతర జీవరాసులు సీతాకోకచిలుక మాదిరిగా ఒకేసారి కాకుండా అనేకసార్లు గుడ్లుగాని, పిల్లలుగాని పెట్టి చనిపోతూన్నప్పటికీ, గతితార్కిక

సిద్ధాంతాన్ని అర్థం చేసుకోవడానికి యీ ఉదాహరణ చక్కగా వుపయోగిస్తుంది.

ఇక్కడ మనం జ్ఞాపకముంచుకోవలసిన విషయమేమంటే, ధాన్యపు గింజ నుంచి మొలిచిన మొక్కద్వారా అనేక ధాన్యపుగింజలు లభిస్తాయి; కోడిగుడ్డునుంచి బయటికి వచ్చిన పిల్ల పెద్దదై అనేక కోడిగుడ్లు పెడుతుంది. సీతాకోకచిలుక విషయంకూడా యింతే.

కొందరు ఒక అనుమానం వెల్లడించవచ్చు. ధాన్యపు గింజను నలగ గొట్టడంద్వారా, లేక కోడిగుడ్డును చితకకొట్టడం ద్వారాకూడా వాటిని విధ్వంసం చేయవచ్చుగదా! అప్పుడు గతితార్కిక సిద్ధాంతం తప్పు కావడంలేదా? కాని మనం యిక్కడ గతితార్కిక విధ్వంసాన్ని గురించే చర్చిస్తున్నాం. బాహ్యశక్తి జోక్యంలేకుండా స్వయంగమనశక్తి వల్ల జరిగే విధ్వంసమే గతితార్కిక విధ్వంసం అనబడుతుంది. ఒక పదార్థం గాని, జీవిగాని గతితార్కికంగా విధ్వంసం చేయబడ్డమంటే అర్థం దాని స్థానే మరొక విధ్వంసకశక్తి ఉద్భవించేటట్లు చూడ్డం. ధాన్యపుగింజనుగాని, కోడిగుడ్డునుగాని ధ్వంసం చేసినప్పుడు వాటి స్థానంలో మరొక విధ్వంసకశక్తిని మనం సృష్టించడంలేదుకదా! అందుచేత, మనం ఎల్లప్పుడూ "గతితార్కిక విధ్వంసానికీ," "యాంత్రిక విధ్వంసానికీ" మధ్యగల వ్యత్యాసాన్ని గుర్తిస్తూవుండాలి.

సమాజ పరిణామంలోకూడ యీ సూత్రం యెలా అమలు జరుగుతుందో మనం చూడవచ్చు.

మొదటినుంచీ సమాజం రెండు వ్యతిరేకశక్తుల సంఘర్షణ మూలంగా ఒక దశనుంచి మరొక దశకు మార్పు చెందుతూ వచ్చింది. ఆదిమ కమ్యూనిజంలో ప్రజలు సమిష్టిగా శ్రమపడేవారు; సమిష్టిగా ఆ శ్రమఫలితాన్ని అనుభవించేవారు; ఉత్పత్తి సాధనాలన్నీ సమిష్టి ఆస్తి. వర్గాలుగాని, వర్గపోరాటంగాని వుండేవికావు. ఈవిధంగా అనేకవేల సంవత్సరాలు గడిచాక వ్యవసాయంవల్ల, పశుపాలనవల్ల ప్రజల అవసరాలకు మించి ఉత్పత్తి జరిగే అవకాశం ఏర్పడింది. అంటే ఉత్పత్తిశక్తులు బాగా అభివృద్ధిచెందాయన్నమాట. ఆనాటి ప్రజలు యీ అభివృద్ధి కనుగుణ్యంగా ఉత్పత్తి సంబంధాలను మార్చుకోవలసివచ్చింది. సమిష్టిశ్రమ-సమిష్టి అనుభవం అనే ప్రాతిపదికపై యేర్పడ్డ ఆదిమ కమ్యూనిస్టు సమాజం, బానిసలు - బానిస యజమానులు అనేక

వర్గాలుగా విడిపోయింది. అంటే వర్గరహిత సమాజం వర్గసమాజంచే విధ్వంసం చేయబడిందన్నమాట. ధాన్యపుగింజ ధాన్యపుమొక్కచే విధ్వంసం చేయబడినట్లు అదిమకమ్యూనిజం స్వంత ఆస్తి ప్రాతిపాదికపై యేర్పడ్డ వర్గసమాజంచే విధ్వంసం చేయుబడింది. అనాటి పరిస్థితుల్లో ఉత్పత్తిశక్తుల అభివృద్ధితో సమానంగా ఉత్పత్తిసంబంధాలు అభివృద్ధిచెందదానికి, స్వంత ఆస్తివిధానంపై ఆధారపడే వర్గసమాజం యేర్పడవలసివచ్చింది.

ఇది మొదటి దశ.

వర్గసమాజంలో (బానిస విధాసం, భూస్వామ్య విధానం, పెట్టుబడిదారీ విధానం) కూడా ఆ సమాజాన్ని విధ్వంసం చేసేశక్తి ఒకటి పుట్టిపెరుగుతుంది. ఎందుచేతంటే, ఉత్పత్తిసంబంధాలకంటె ఉత్పత్తిశక్తులు పురోగమిస్తూ అభివృద్ధి చెందదంవల్ల వర్గాల ప్రాతిపదికపై యేర్పడ్డ సమాజం విధ్వంసం కావడం అవసరం, తప్పనిసరి అవుతుంది. అంటే స్వంత ఆస్తి విధానం విధ్వంసమై, సమిష్టి ఆస్తి విధానం, కమ్యూనిస్టు సమాజం ఏర్పడవలసి యుంటుంది. ఈ విధంగా మనం బయల్దేరినచోటుకే మళ్ళీ వస్తున్నామన్నమాట. అయితే అది పూర్వపు ఆదిమ కమ్యూనిజంవలె కాకుండా, దానికంటె ఉన్నతస్థాయి కలిగిన కమ్యూనిజం ఏర్పడుతుంది. ఆదిమకమ్యూనిజంలో అది పుష్కలంగా వుంటుంది. ఈ విధంగా, ఆదిమ కమ్యూనిస్టు సమాజాన్ని విధ్వంసం చేసిన వర్గసమాజం ఆధునిక కమ్యూనిస్టు సమాజంచే విధ్వంసం చేయబడుతుంది.

తత్వశాస్త్రం యొక్క పరిణామంలో కూడా విరోధ వైరుధ్యసూత్రం కనిపిస్తుంది ఉదాహరణకు స్వాభావిక భౌతికవాదాన్ని ఖండించడానికి భావవాదం బయల్దేరింది. శాస్త్రాధారం లేని స్వాభావిక భౌతికవాదం భావవాదం ముందు నిలవలేకపోయింది. కాని శాస్త్రవిజ్ఞానం అభివృద్ధి చెందిన తర్వాత యాంత్రిక భౌతికవాదం భావవాదాన్ని ఓడించింది. స్వాభావిక భౌతికవాదాన్ని విధ్వంసం చేసిన భావవాదం యాంత్రిక భౌతికవాదంచేత విధ్వంసం చేయబడిందన్నమాట. అయితే, మొదటి భౌతికవాదానికీ ఈ భౌతికవాదానికీ వ్యత్యాసం చాలా ఉంది.

ఇదేవిధంగా, యాంత్రిక భౌతికవాదం హెగెల్ గతితార్కిక భావవాదంచే విధ్వంసం చేయబడింది; దీన్ని మళ్లా మార్క్సు గతితార్కిక భౌతికవాదం విధ్వంసం చేసింది. యాంత్రిక భౌతికవాదంకన్న గతితార్కిక భౌతికవాదం ఉన్నతమైనదీ, విస్తృతమైనదీను.

మూడవ సూత్రం పరిమాణం గుణంగా మారే విధం (Change Of Quantity Into Quality):

వస్తువులు, లేదా జీవులు, లేదా వ్యవస్థలు క్రమక్రమంగా అభివృద్ధిచెంది, అకస్మాత్తుగా కొత్తరూపాలు ధరిస్తాయి. వాటి పరిమాణం హెచ్చే కొద్దీ కొత్తగుణాలు సంక్రమిస్తాయి.

ఉదాహరణకు నీటి ఉష్ణోగ్రతను క్రమక్రమంగా హెచ్చించామనుకుందాం. 100 డిగ్రీలవరకు నీటిని అలా వేడిచేస్తే, అకస్మాత్తుగా దానినుంచి ఆవిరి బయల్దేరుతుంది. ఇంకా వేడిచేస్తే నీరంతా ఆవిరిగా మారిపోతుంది.

ఇదేవిధంగా నీటి టెంపరేచరును తగ్గించడం మొదలు పెడితే 0 డిగ్రీవద్ద ఘనపదార్థంగా మారిపోతుంది.

ఇట్టి ఉదాహరణలు రసాయనికశాస్త్రంనుంచి ఎన్నైనా యివ్వవచ్చు. రెండు హైడ్రోజన్ ఆటంలు; ఒక ఆక్సిజన్ ఆటంకలిస్తే నీరు ఏర్పడుతుంది. రెండు హైడ్రోజన్ ఆటంలు, రెండు ఆక్సిజన్ ఆటంలు కలిస్తే హైడ్రోజన్ పెరాక్సైడ్ అనే పదార్థం ఏర్పడుతుంది. ఒక కార్బన్ ఆటం, ఒక ఆక్సిజన్ ఆటం కలిస్తే కార్బన్ మోనాక్సైడ్ వస్తుంది. ఒక కార్బన్ ఆటం, రెండు ఆక్సిజన్ ఆటంలు కలిస్తే కార్బన్ దయాక్సైడ్ లభిస్తుంది.

మన నిత్య జీవితంనుంచికూడా యిలాంటి ఉదాహరణలు అనేకం యివ్వవచ్చును. మామిడిపిందె క్రమక్రమంగా ముదిరి టెంక కడుతుంది. ఇంకా ముదిరి పండుతుంది. ఒక రోజున అకస్మాత్తుగా కిందపడుతుంది. అలా కిందపడిన మామిడిపండు చెట్టునవున్న మామిడిపండువంటిది కాదు. శిథిలావస్థ ప్రారంభమైన మామిడిపండు అది. అనగా, మామిడికాయ పరిమాణం హెచ్చి హెచ్చి చివరకు శిథిలావస్థలోవున్న పండుగా మారిపోయిందన్నమాట.

పూర్వం నెపోలియన్ చక్రవర్తి ఫ్రెంచి సామ్రాజ్యాన్ని విస్తరింప జేసుకోవడానికి యూరపు అంతటా దండయాత్రలు ప్రారంభించాడు. ఆ సందర్భంలో అతడు మామెలూక్స్ అను జాతివారితో యుద్ధం చేయవలసి వచ్చింది. మామెలూక్స్ అశ్వారూఢులై యుద్ధం చేయడంలో మంచి నిపుణులు. కాని వారికి క్రమశిక్షణ లేదు. ఫ్రెంచి సైనికులకు మంచి క్రమశిక్షణవుంది. కాని అశ్వారూఢులై యుద్ధం చేయడంలో వారు

నిపుణులుకారు. మామెలూక్స్‌కూ, ఫ్రెంచి సైనికులకూ మధ్యగల ఈ వైరుధ్యాన్ని ఆధారంగా చేసుకుని నెపోలియన్ చక్రవర్తి ఒక చక్కని యుద్ధవ్యూహం కనిపెట్టాడు. తన పరిశీలనద్వారా అతడు తెలుసుకున్న విషయమేమంటే: ఇద్దరు మామెలూక్స్, ముగ్గురు ఫ్రెంచి సైనికుల్ని సులభంగా ఓడించగలరు. 100 మంది మామెలూక్స్ 100 మంది ఫ్రెంచి సైనికులతో సమానం. 300 మంది ఫ్రెంచి సైనికులు 300 మంది మామెలూక్స్‌ను కొంచెం కష్టంమీద ఓడించగలరు. 1000 మంది ఫ్రెంచి సైనికులు 1500 మంది మామెలూక్స్‌ను సులభంగా ఓడించవచ్చు.

యుద్ధవ్యూహంలో ఫ్రెంచి సైనికుల సంఖ్యను (పరిమాణాన్ని) పెంచడంద్వారా గుణం ఎలామారుతుందో యీ ఉదాహరణవల్ల తెలుసుకోవచ్చు.

ఒక అసెంబ్లీస్థానానికి యిద్దరు అభ్యర్థులు పోటీ చేస్తున్నారనుకుందాం. ఏ అభ్యర్థికైనా 4000 వోట్లు వస్తేనే అతనికి మెజారిటీ లభిస్తుందని ఊహించుకుందాం. ఆ యిద్దరిలో 'అ' అను అభ్యర్థికి 3999 వోట్లు లభించినప్పటికీ, అతడింకా అభ్యర్థిగానే వుంటాడు. మరొక్కవోటు లభిస్తే, వోట్ల ప్రమాణంలో వచ్చిన ఆ పెరుగుదల అభ్యర్థియొక్క గుణాన్ని మార్చగలుగుతుంది. అప్పటివరకూ కేవలం ఒక అభ్యర్థిగావున్న ఆ వ్యక్తి చటుక్కున అసెంబ్లీ మెంబరు అయిపోతాడు.

ప్రస్తుత సామాజికవ్యవస్థను సంస్కరణలద్వారా మార్చాలా, విప్లవంద్వారానా? పెట్టుబడిదారీ సమాజాన్ని సంస్కరించడంద్వారా సోషలిజాన్ని సాధించాలా, లేక విప్లవంద్వారానా? అనే ప్రశ్న తరచు మనకు ఎదురవుతూవుంటుంది.

సాధారణంగా కొందరు, చిన్న చిన్న సంస్కరణలవల్ల సామాజికవ్యవస్థ మార్పు చెందుతుందనీ, అనేక చిన్న సంస్కరణలు కలిస్తే పెట్టుబడిదారీసమాజం సోషలిస్టు సమాజంగా మారుతుందనీ భావిస్తారు. ఈ సిద్ధాంతమే సంస్కరణవాదమని వ్యవహరింపబడుతోంది. దీన్ని బలపరచేవారు సంస్కరణవాదులని పిలువబడుతున్నారు. కేవలం సంస్కరణలు కోరడమే సంస్కరణవాద మనిపించుకోదు. కేవలం సంస్కరణలే సరిపోతాయనీ, అనేక సంస్కరణలు కలిసి పెట్టుబడిదారీ విధానం సోషలిజంగా మారిపోతుందనీ వాదించడమే సంస్కరణవాదం.

ఈ వాదన సరియైనదికాదని వాస్తవ పరిస్థితులే రుజువు చేస్తున్నాయి. మానవ సమాజం సంస్కరణలద్వారా కాక, విప్లవాలద్వారా మార్పుచెందుతోందని వాస్తవ ఘటనలను గుర్తించేవారందరూ అంగీకరిస్తున్నారు.

అందుచేత పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిచెందింది - అంటే దాని పరిమాణం హెచ్చి - ఒకానొక దశలో విప్లవం ద్వారా విధ్వంసం చేయబడు తుందన్నమాట. అంటే, మరోగుణం దానికి వస్తుంది.

అదే, పెట్టుబడిదారీవర్గం చేతుల్లోనుంచి కార్మికవర్గం చేతుల్లోకి అధికారం రావడం.

భూస్వామ్య దోపిడీకి లోనవుతున్న ఒక గ్రామంలో కమ్యూనిస్టుపార్టీ తన కార్యక్రమాన్ని ప్రారంభించిందనుకున్నాం. రాత్రి పాఠశాలల ద్వారా వయోజనులకు విద్య, బహిరంగసభలద్వారా భూస్వాముల అక్రమాలను బహిర్గతం చేయడం, రైతు- కూలీ ప్రజానీకాన్ని వారివారి వర్గసంఘాలలో సంఘటితపర్చడం మొదలైన కార్యకలాపాలద్వారా ఆ గ్రామంలో ప్రజల చైతన్యం ఒక రోజుకంటె మరొకరోజు అభివృద్ధిచెందుతూవుంటుంది. పరిమాణంలో వచ్చిన యీ మార్పు సమ్మెద్వారానో, భూమికోసం పోరాడ్డం ద్వారానో గుణాత్మకమైన మార్పుకు దారితీస్తుంది. అనేక సంవత్సరాలుగా గ్రామంలో తన మాట కెదురులేకుండా రాజ్యమేలే భూస్వాములు మొట్టమొదటిసారి ప్రజల ప్రతిఘటన నెదుర్కోవలసి రావడంతో వారి అధికారగర్వం దెబ్బతింటుంది. అంతవరకూ అణగిమణగియున్న గ్రామీణ ప్రజల్లో ఆత్మవిశ్వాసం, పోరాటపటిమ వృద్ధిచెందుతాయి. గ్రామ జీవితంలో యిదొక గుణాత్మక మార్పు అని చెప్పవచ్చు.

పై మూడు సూత్రాలూ కలిసి గతితార్కికభౌతికవాదమవుతుంది. ఒక వస్తువును, లేదా ఒక జీవిని, లేదా ఒక సామాజికవ్యవస్థను మనం పరిశీలించేటప్పుడు యీ మూడు సూత్రాల్నీ దృష్టియందుంచుకోవాలి. ఒక్కొక్క సూత్రం మిగతా రెండింటితో సంబంధంలేనట్లు చూడకూడదు. మూడు సూత్రాల్నీ కలిపి పరిశోధనలు చేసినప్పుడే మనం మార్పుకు సిసలైన కారణం తెలుసుకోగల్గుతాం.



# తొమ్మిదవ అధ్యాయం

## ముగింపు

పై అధ్యాయాలు చదివిన తర్వాత, ప్రపంచంలో ప్రతిదీ స్వయంగమనశక్తిద్వారా నిరంతరం మార్పుచెందుతుందని గ్రహిస్తాం. అన్ని వస్తువులూ, అన్ని జీవులూ, అన్ని ఘటనలూ ఒక పరిణామక్రమానికి అంత్యదశ అనీ, మరో పరిణామక్రమానికి ప్రారంభదశ అనీ తెలుసుకోగల్గుతాం. ఒకదశకంటె మరోదశ ఉన్నతస్థాయిలో అభివృద్ధిచెందుతుందనికూడా మనకు బోధపడుతుంది.

అయితే కొందరు, మనం కోరే అభ్యుదయకరమైన మార్పు ఎలాగూ వస్తుందిగనుక దానికోసం పోరాడవలసిన అవసరమేముంది? అని ప్రశ్నించవచ్చు.

ఇలా ప్రశ్నించేవారు. సమాజంలోని అన్ని మార్పులూ మానవునిద్వారానే జరుగుతాయని తెలుసుకోలేకపోతున్నారు. మార్క్స్ చెప్పినట్లు "సోషలిజం పుట్టడానికి మంత్రసాని వుండాలి." విప్లవమే ఆ మంత్రసాని. అంతేకాక మానవుడు గతితార్కికమైన మార్పుకు సహాయమూ చేయగలడు; తాత్కాలికంగా నిరోధించనూగలడు.

అందుచేత ప్రపంచాన్ని, సమాజాన్ని మార్చడంలో మానవునిపాత్రను మనం తక్కువ అంచనా వేయకూడదు. గతితార్కిక భౌతికవాదాన్ని మనం సరిగా అర్థం చేసుకుంటే, మార్పు మన అవసరాల కనుగుణ్యంగా జరిగేటట్లు చేసుకోగలం. అయితే ఆ అవసరాలు సామాజికాభివృద్ధికి తగినట్లువుండాలి.

మనలో అనేకమందికి గతితార్కిక భౌతికవాదమంటే ఏమిటో తెలియదు. అయినప్పటికీ అనుభవంద్వారాను, సరియైన పరిశీలనల ద్వారాను మనం అభ్యుదయమార్గాన ఎన్నోమార్పులు తీసుకురాగల్గుతున్నాం. కింది ఉదాహరణలవల్ల మనకీ విషయం బోధపడగలదు.

కొన్ని ఉదాహరణలు:

1. సాధారణంగా మనం యితరులకు మన అభిప్రాయాలను తెలియచేయదలుచుకున్నప్పుడు వ్యాసంద్వారాగాని, ఉపన్యాసంద్వారాగాని, గేయం ద్వారాగాని, చిత్రంద్వారాగాని తెలియజేస్తాం. అయితే, మనం చెప్పదలచుకున్న విషయానికి (Content) సరిపోయే విధంగా రూపం (form) కూడా ఉండేటట్లు విచక్షణతో వాటిని వుపయోగిస్తాం. అట్టి సమన్వయం లేనప్పుడు మన అభిప్రాయాలను సూటిగా చెప్పలేకపోతాం. ఇలాగే కాలిజోడు బిగువైనప్పుడుగాని, కోటు చిన్నదైనప్పుడుగాని, చిక్కు పరిస్థితులేర్పడ్డం మన మెరుగుదుం. ఉపాధ్యాయుడు పిల్లలకు ఒక విషయం బోధించదలచుకున్నప్పుడు, ఏ పద్ధతి నవలంబిస్తే బాగుంటుందో యోచించుకుంటాడు. ప్రతిదేశంలోను ప్రభుత్వం కొన్ని విశిష్టరూపాలలో విద్యావిధానాన్ని అమలుజరుపుతుంది. (ప్రాథమిక పాఠశాలలు, హైస్కూళ్ళు, కాలేజీలు, వృత్తివిద్యాలయాలు వగైరా) ఫ్యాక్టరీలలో వస్తూత్పత్తి ఒక నిర్దిష్టమైన నిర్మాణపద్ధతిలో జరుగుతుంది. ఒక్కొక్క రాజకీయపార్టీ తన కార్యక్రమాన్ని అమలుజరపడంలో ఒక్కొక్క విధమైన నిర్మాణసూత్రాల నవలంబిస్తుంది. కొత్తగా పుట్టిన ఒక బిడ్డను తీసుకుందాం. ఆ బిడ్డ తల్లివద్ద పాలుతాగడం నేర్చుకుంటుంది. కొంతకాలానికి రెండు పరస్పర వ్యతిరేక లక్షణాలు ఆ బిడ్డలో కనిపిస్తాయి. ఒకటి తల్లిపాలకు బాగా అలవాటుపడ్డం; రెండు, అందువల్ల యేర్పడే శారీరకావసరాలు యితరవిధాలైన ఆహారంద్వారాగాని తీరకపోవడం. ఈ రెండవ లక్షణం క్రమంగా బలీయమై, తల్లిపాలకు పూర్తిగా స్వస్తిచెప్పవలసిన ఆగత్యం కలుగుతుంది. అప్పుడు ఆ బిడ్డలో స్పష్టమైన మార్పువస్తుంది. మాటిమాటికీ తల్లిపాలకోసం పరుగెత్తడం మానివేసి, స్వతంత్రజీవనం అలవరుచుకుంటుంది. దీన్నే మరోవిధంగా చెప్పాలంటే, బిడ్డయొక్క శారీరకావసరాలు "విషయం" (Content), వాటిని తీర్చుకునేటందుకు బిడ్డ ఆహారంతీసుకునేపద్ధతి "రూపం" (form). ప్రతి "రూపం", "విషయాన్ని" కొత్తదశకు తోస్తూ వుంటుంది. ప్రతిదశ "రూపాన్ని" మార్చుతూవుంటుంది.

అందుచేత, మనం మార్పునుగూర్చి తెలుసుకునేటప్పుడు రూపాన్నిగురించీ, విషయాన్నిగురించీకూడా తెలుసుకోవలసివుంటుంది. ఎందుచేతంటే, "విషయం" మారినప్పుడల్లా "రూపం" కూడా

తదనుగుణ్యంగా మార్పుచెందాలి; లేకపోతే, అనేక చిక్కుపరిస్థితు లేర్పడతాయి.

పాదం పెద్దదై జోడు చిన్నదైతే, నడవడం కష్టమౌతుంది. అదేవిధంగా పెరిగేబిడ్డకు బలమిచ్చే ఆహారం పెట్టకపోతే బిడ్డ కృశిస్తుంది.

2. తెలివితేటలతో మనం మెలగకపోతే మార్పు మన కిష్టంగాని విధంగా జరుగుతుంది. ఉదాహరణకు: దేశభక్తితో ప్రేరేపింపబడిన ఒక యువకుడు సైన్యంలో చేరుతాడు. శ్రద్ధతో తరిఫీదు పొందుతాడు. కాని ఆ తరిఫీదు తెలివితేటలతో కూడినదికాకపోతే, అతనిలో విరక్తిపుడుతుంది. ఇలా రెండు సంవత్సరాలు గడిచాయి అనుకుందాం. అప్పుడు అతనిలో ఉత్సాహం పూర్తిగా నశిస్తుంది. విరక్తిభావం బలపడుతుంది.

3. మనం తెలివితేటలతో మెలిగితే రెండు వ్యతిరేకశక్తుల్ని మనకు కావలసినఫలితం యిచ్చేలా ఐక్యపరచవచ్చు. ఉదాహరణకు చాకుతో మన మొక రాతిని చెక్కడం మొదలు పెడతాం. వెంటనే ఆ రెంటిమధ్య రాపిడి బయల్దేరుతుంది. రాతి మీద మనం ప్రారంభించిన చర్య(Action) చాకుమీద ప్రతిచర్యకు (Counter-action) దారితీస్తుంది. దానివల్ల చాకుమొద్దుబారుతుంది. ఆ చాకునే తీసుకుని తెలివితేటలతో రాతిమీద నూరితే, చాకు పదునెక్కుతుంది. ఆ రెండింటి మధ్య బయల్దేరే రాపిడి మనకు కావలసిన మార్పునిస్తుంది.

4. 1941లో జర్మన్లు సోవియట్ యూనియన్‌ను ఓడించడానికి పిన్సర్‌మువ్‌మెంట్(Pencer Movement)అనేపేరుతో ఒక యుద్ధవ్యూహం పన్నేరు. రష్యన్ల రక్షణశ్రేణి ఎక్కడెక్కడ బలహీనంగావుందో కనిపెట్టడానికి అతి శక్తివంతమైన కొన్ని టాంకుదళాలను, ఫిరంగిదళాలను మొదట పంపేవారు. అవి బలహీనమైన స్థావరాలను కనిపెట్టి వాటిగుండాముందుకు చొచ్చుకుపోయేవి. ఇలా రెండుచోట్ల లోపలికి ప్రవేశించిన టాంకుదళాలు ఆప్రాంతాన్నంతటినీ చక్రబంధంలో బిగించివేస్తే, సోవియటుసేనలు నాశనమవుతాయని జర్మన్ల అంచనా. కాని సోవియటు సైనికాధికారులు ఎత్తుకు పైయెత్తువేశారు. జర్మన్ల పిన్సర్ మువ్‌మెంటును ఎదుర్కొనేటందుకు ఒకే ప్రదేశంలో బలమైన టాంకుదళాలను, ఫిరంగిదళాలను కేంద్రీకరించక అసంఖ్యాకమైన ప్రదేశాల్లో చిన్న చిన్న రక్షణశ్రేణుల్ని నిర్మించారు. దీనిఫలితం

ఏమయిందంటే, యెక్కడ చూచినా చిన్న చిన్న పిన్సర్ మువ్‌మెంట్లు అనేకం యేర్పడేవి. దీనితో జర్మన్‌వ్యూహం తలకిందులయి, అతి విశాలమైన ప్రదేశంలో బాహాబాహియుద్ధం చేయవలసివచ్చేది. కాని, జర్మన్ సైనికుని తరఫీదు వ్యక్తిగత నైపుణ్యాన్ని ప్రోత్సహించకపోవడంవల్ల, సోవియటుసైనికునిముందు అతడు నిలువలేకపోయేవాడు.

5. మన మొక క్లిష్టమైన సమస్యను పరిష్కరించేటప్పుడు, లేదా ఒకప్లాను తయారుచేసేటప్పుడు, లేదా ఒక వాస్తవ విషయాన్ని నిర్వచించేటప్పుడు దానికి సంబంధించిన వివరాలన్నిటినీ సేకరిస్తాం. అయితే అన్ని వివరాలు మనకు ముఖ్యం కాకపోవచ్చు. "ఏది ముఖ్యం" అని అడుగడుక్కీ ప్రశ్నించుకుంటాం. చివరకు ఒక సమగ్రమైనరూపం మన యెదుట వుంటుంది. ఉదాహరణకు "టేబులు ప్రపంచ కార్మికుల శ్రమఫలితం" అని రుజువుచేయాలంటే, మనం కింది విధంగా ప్రశ్నోత్తరాల పద్ధతి నవలంబిస్తాం:

ప్రశ్న: ఈ టేబులును తయారుచేసింది ఎవరు?

జవాబు: సుబ్బయ్య అనే వడ్రంగి.

ప్రశ్న: సుబ్బయ్య ఒక్కడే స్వంతంగా తయారుచేశాడా?

జవాబు: లేదు. అతడు కర్రల అడితీలో కర్రకొని, దానితో తయారుచేశాడు.

ప్రశ్న: అడితికి కర్ర ఎలా వచ్చింది?

జవాబు: అడవుల్లోనుంచి.

ఈ విధంగా, మనం గతంలో సంపాదించిన అనుభవాన్ని ఆధారంచేసుకుని, టేబులుకు సంబంధించిన వివరాలను ఒకదానితర్వాత ఒకటి వాటి ప్రాధాన్యతనుబట్టి సమకూర్చుతాం.

పై జవాబులు సరియైనవో, కావో తెలుసుకోవడానికి ఒక్కొక్క జవాబునే తీసుకుని, దాన్ని ఆచరణలో పరిశీలిస్తాం. తత్ఫలితంగా మనకు కొత్త వివరాలెన్నో లభిస్తాయి. ఉదాహరణకు, సుబ్బయ్య తయారుచేసిన టేబులును ఆచరణలో పరిశీలిస్తే, కర్రల అడితీ మన యెదుట ప్రత్యక్షమవుతుంది. అక్కడికి కర్ర ఎలా వచ్చిందో ఆలోచిస్తాం. అంటే పూర్వంకంటె మనకు ఎక్కువ విషయపరిజ్ఞానం లభించిందన్నమాట. ఈ విధంగా పరిస్థితిలో ఎప్పటి కప్పుడు మార్పు కలుగుతూ వుంటుంది.

చివరకు లభించే వివరాలన్నింటినీ కలిపితే ఒక సమగ్రమైన జవాబు వస్తుంది.

ఉదాహరణకు:

ప్రశ్న: అడవుల్లో కలపను కొట్టిందెవరు?

జవాబు: కూలీలు.

ప్రశ్న: దాన్ని చెక్కలుగా కోసిందెవరు?

జవాబు: రంపపుమిల్లులో పనిచేసే కార్మికులు.

ప్రశ్న: వాటిని అడితీకి తెచ్చిందెవరు?

జవాబు: లారీడ్రైవర్లు, రైల్వే కార్మికులు.

ప్రశ్న: రైల్వేలను, లారీలను తయారుచేసిం దెవరు?

జవాబు: ఇంజనీర్లు, మెకానిక్కులు, ఫిట్టర్లు వగైరా.

ప్రశ్న: అందుచేత, సుబ్బయ్య వీరందరి శ్రమవల్ల లభించిన చెక్కలను కుర్చీరూపంలో సమకూర్చాడన్నమాట.

జవాబు: ఔను.

ప్రశ్న: అతడు వుపయోగించిన పనిముట్లు ఏవి?

జవాబు: రంపం, సుత్తి, ఉలి, శానం, చిత్రిక వగైరా.

ప్రశ్న: ఇవి అతని కెలా వచ్చాయి?

జవాబు: బజార్లో కొనుక్కున్నాడు.

ప్రశ్న: వాటి నెవరు తయారుచేశారు?

జవాబు: అనేకమంది కార్మికులు.

ప్రశ్న: వాటికి కావలసిన ముడిపదార్థాలు ఎక్కణ్ణించి వచ్చాయి?

జవాబు: ప్రపంచంలోని అనేక దేశాలనుంచి. అందు చేత టేబులు ప్రపంచ కార్మికుల శ్రమఫలితం.

ఈ విధంగా ప్రతి ప్రశ్న దాని ముందు ప్రశ్న యొక్క అసంపూర్తి జవాబు నుంచి పుడుతోంది. ప్రతి అసంపూర్తి జవాబువల్ల వచ్చే వివరం మన జ్ఞానాన్ని ఎక్కువచేస్తుంది. చివరకు వచ్చేసరికి, మొదటి ప్రశ్న నే కొత్త వాతావరణంలో అడగడం, దానికి సమగ్రమైన జవాబు పొందడం జరుగుతుంది. ఇలా కాకుండా, మొట్టమొదటే ఒకేసారి పూర్తిజవాబు చెప్పివేస్తే, దాని ప్రాముఖ్యత అందరికీ తెలియదు.

ఈ ఉదాహరణలనుబట్టి, మానవుడు గతితార్కిక సూత్రాల సహాయంతో తన్ను తానూ, తోటి మానవుల్నీ అభ్యుదయపథంలో నడపగలడని తెలుసుకోవచ్చు. అభ్యుదయ నిరోధక శక్తులు ఎన్ని ఆటంకాలు కలిగించినా తాత్కాలికంగా ఎన్ని విజయాలు సంపాదించినా, అంతిమవిజయం మాత్రం గతితార్కిక మార్పుదేనని స్పష్టమవుతుంది. పెట్టుబడిదారీవిధానంలోని వైరుధ్యాలను గతితార్కికదృష్టితో అర్థంచేసుకున్న ఒక వ్యక్తి ఆ విధానం కూలిపోకతప్పదనీ, దాని స్థానే సోషలిజం వచ్చితీరుతుందనీ సులభంగా చెప్పగల్గుతాడు. అందుకై ఆత్మ విశ్వాసంతో పనిచేయగల్గుతాడు. ఎన్ని త్యాగాలకైనా వెనుదీయడు.

అయితే, మనం గతితార్కికభౌతిక వాదాన్ని ముక్కుకు సూటిగాను, యాంత్రికంగాను అనుసరించకూడదు. ఉదాహరణకు అన్ని విధాలైన జ్ఞానంలో కొంత నిజం, కొంత అబద్ధం వుంటుందని వాదించడం గతితార్కికపద్ధతి కాదు. ప్రపంచంలోని వాస్తవవిషయాలన్నింటిలో కొంత నిజం, కొంత అబద్ధంవుంటుందనే వక్రభాష్యానికి యిది దారితీస్తుంది. ఇది పరస్పర వైరుధ్యాలమధ్య సంఘర్షణను ముక్కుకు సూటిగా అర్థంచేసుకోవడమే. అదేవిధంగా, విరోధ వైరుధ్యసూత్రాన్ని అన్వయించేటప్పుడు అన్ని ఘటనల్లోనూ మూడు పరిణామదశలూ వుంటాయని భావించకూడదు. ఒక్కొక్కప్పుడు మొదటిదశ, రెండవదశ మాత్రమే వుండవచ్చు; మూడవదశ బీజరూపంలో మనకు కనబడకపోవచ్చు. అంటే పరిణామక్రమం యింకా పూర్తికాలేదన్నమాట.

మన జ్ఞానం పరిమితమైందనీ, అనేక చీకటిగొందుల్లో మనం తరచు చిక్కుకోవచ్చుననీ మరచిపోకూడదు.

అందువల్ల, మనం ఏ సమస్యనైనా పరిష్కరించేటప్పుడు దానికి సంబంధించిన అనేక విషయాలను విభిన్న దృక్పథాలనుంచి పరిశీలించాలి. దాని పరిణామక్రమాన్ని తెలుసుకోవాలి. ఏ పరిష్కారమార్గం సమాజపురోభివృద్ధికి దోహదమిస్తుందో అన్వేషించాలి. ఇట్టి పరిశీలనలద్వారానే మనం గతితార్కికసూత్రాలను శాస్త్రీయంగా అన్వయించగల్గుతాం. ఇందుకు సంకుచితదృష్టిగాని, స్వీయ మానసిక దృక్పథంగాని పనికిరాదు. మార్క్స్, ఎంగెల్స్‌లు కనిపెట్టిన గతితార్కిక భౌతికవాదం సమాజపురోభివృద్ధికి ఒక సాధనంగా వినియోగపడింది. పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించి సోషలిస్టు సమాజాన్ని

నిర్మించడంలోను, సోషలిస్టు సమాజాన్ని కమ్యూనిస్టు సమాజంగా అభివృద్ధి పరచడంలోను గతితార్కిక భౌతికవాదం ఎంతో అద్భుతమైన పాత్రను నిర్వహిస్తోంది. మానవుడు దాని సూత్రాలను ఎంత చక్కగా అర్థంచేసుకొని అమలుజరిపితే అంత సులభంగాను, వేగంగాను, సమాజాన్ని ముందుకు తీసుకుపోగల్గుతాడు.



# ప్రజాతంత్ర వాదులు - మార్క్సిస్టులు తప్పక చదవాల్సిన గ్రంథాలు !

| | | రూ. |
|---|---|---|
| 1. | భారతదేశ చరిత్ర రచనలో మతతత్వం - డా॥ రొమిల్లా థాపర్, హర్బన్స్ ముఖియా, బిపిన్ చంద్ర | 10 |
| 2. | భగవద్గీత - మార్క్సిజం - ఆర్వియార్ | 10 |
| 3. | సమాజం - చరిత్ర - ఆంగ్లం : డా॥ రొమిల్లా థాపర్, అనువాదం : డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు | 5 |
| 4. | మతం - మార్క్సిజం - ఆర్వియార్ | 8 |
| 5. | హిందూమతం, కులవ్యవస్థ భారతీయ సంస్కృతి - ఆర్వియార్ | 40 |
| 6. | కమ్యూనిస్టు నీతి - సంకలనం : కంభంపాటి సత్యనారాయణ | 25 |
| 7. | పరిణామవాదం - చలసాని వాసుదేవరావు | 10 |
| 8. | కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక - మార్క్స్ - ఎంగెల్స్ | 15 |
| 9. | భారత స్వాతంత్ర్య సమర చరిత్ర - ముక్కామల నాగభూషణం | 120 |
| 10. | ప్రాచీన భారతదేశ చరిత్ర - ఆంగ్లం : రామ్‌శరణ్ శర్మ, తెలుగు అనువాదం : వల్లంపాటి వెంకటసుబ్బయ్య | 100 |
| 11. | సాహిత్యం - రాజకీయం - వేములపల్లి శ్రీకృష్ణ (పులుపుల వెంకట శివయ్య స్మారకోపన్యాసం) | 6 |
| 12. | కార్ల్‌మార్క్స్ పెట్టుబడి - మూడు సంపుటాలు (సెట్) | 650 |
| 13. | భారతీయ తత్వశాస్త్రము - ఏటుకూరి బలరామమూర్తి | 50 |
| 14. | మార్క్సిజం పాఠాలు - 1 - తెలుగుసేత : ఆర్వియార్ | 8 |
| 15. | మార్క్సిజం పాఠాలు - 2 - తెలుగుసేత : ఆర్వియార్ | 15 |
| 16. | మార్క్సిజం పాఠాలు - 3 - తెలుగుసేత : ఆర్వియార్ | 8 |
| 17. | మార్క్సిజం అంటే ఏమిటి? - ఆంగ్లం : ఎమిలీ బరన్స్, తెలుగు అనువాదం : మద్దుకూరి చంద్రం | 15 |
| 18. | కమ్యూనిజం అంటే ఏమిటి? -ఆంగ్లం:చిన్మోహన్ సహనోబిస్ తెలుగు అనువాదం : వై. విజయ కుమార్ | 10 |
| 19. | గతితార్కిక భౌతికవాదం-కంభంపాటి సత్యనారాయణ(సీనియర్) | 12 |
| 20. | చారిత్రక భౌతికవాదం-కంభంపాటి సత్యనారాయణ(సీనియర్) | 10 |

**ప్రతులకు : విశాలాంధ్ర బుక్ హౌస్‌లు, ప్రసిద్ధ పుస్తక విక్రేతలు.**